# 7 ఆంధ్ర జిల్లాల్లో ఇనుము గనులు

## లోక్ సభలో మంత్రి ప్రకటన

న్యూఢిల్లీ ఏప్రిల్ 9: ఆంధ్రరాష్ట్రంలో ఏడు జిల్లాల్లో, గుంటూరు, కృష్ణా, అనంతపూరు, కడప, కర్నూలు, చిత్తూరు, నెల్లూరుజిల్లాల్లో ఇనుముగను లున్నట్లు భారత భూగర్భ పరిశోధనశాఖ తెలియచేసినట్లు మంత్రి శ్రీ మాలవీయా లోక్ సభలో శ్రీ లక్ష్మయ్య ప్రశ్నలకు జవాబులిస్తూ చెప్పారు.

గుంటూరు జిల్లాలో నాసిరకం ఖనిజం విస్తృతంగా లభ్యమాతుంది. ఈ జిల్లాలో మాగ్నటైట్, హెమటైట్, క్వార్ట్జైట్ ఖనిజాలు నూరడుగుల లోతులో కనీసం రెండు కోట్ల టన్నులు లభ్యమాతుంది. ఇది కాక తుమురుకోట పశ్చిమాన కొండల్లో కూడా నాసిరకం ఇనుము దొరుకుతుంది. ఇక్కడ ఎనిమిదిన్నర కోట్లు టన్నులుంటుంది. ఇక్కడ ఇనుము 35% వస్తుంది.

అనంతపురంజిల్లా రాయదుర్గం తాలూకాలో 60% ఇనుము రవతులు హెమటైట్ లభిస్తుంది.

కడప జిల్లాలో వాబాలి, వగదాలపల్లి, రాజంపేటల్లో 3 లక్షల టన్నులు ఇనుము లభ్యం కాగల గనులున్నాయి. ఈ గనుల్లో నాలుగోవంతు ఖనిజంలో 60% ఇనుము లభిస్తుంది.

కర్నూలుజిల్లాలో వెల్దుర్తి, రామళ్ళకోటలవద్ద 48 మొదలు 65% వరకూ ఖనిజం 87 లక్షల టన్నులు లభ్యం కావచ్చు.

కృష్ణాజిల్లా జగ్గయ్యపేటవద్ద 24½ లక్షల టన్నులు లభ్యమాతుంది.

శిరసంవేడువద్ద మొదలు చిత్తూరు జిల్లా, నెల్లూరుజిల్లాలలో కొంత మేర ఇనుము లభ్యమాతుంది.

## శరణార్థుల "చీమల బారు"

### తూర్పు పాక్ నుంచి రోజుకు 2 వేలు

కలకత్తా, ఏప్రిల్ 8: తూర్పు పాకిస్తాన్ నుంచి వచ్చేసిన శరణార్థులు చెల్లాచెదరుగా పడి ఉంటున్నారు.

ఇంకా చీమల బారుల్లాగా వస్తూనే ఉన్న వీరి సంఖ్య చాలా ఆందోళనకరంగా ఉన్నది. వీరి పునరావాస కార్యక్రమం అస్తవ్యస్తమై పోయింది. ఈ పరిస్థితి యింకా అధ్వాన్నం కాకుండా పునరావాస ప్రణాళికను యిక ముందు చక్కగా సమన్వయపరచటానికి కృషి జరుగుతుంది.

గత మాసంలో దాదాపు 60 వేల మంది శరణార్థులు వచ్చారు.

తూర్పు పాకిస్తాన్ నుంచి రోజుకు 2 వేల మంది శరణార్థులు వస్తూ ఉండటం చేత, కేంద్ర ప్రభుత్వం పశ్చిమ బెంగాల్, అస్సాం, త్రిపురా, మణిపూర్, బీహార్, ఒరిస్సా ప్రభుత్వ చర్యలను శీఘ్రంగా సమన్వయ పరచడానికి తీవ్ర కృషిచేస్తున్నది.

## గ్వాలియర్ లో సహగమనం

గ్వాలియర్, ఏప్రిల్ 8: గ్వాలియర్ కు 180 మైళ్ళలో మొరీనా జిల్లాలో శివపూర్ లో సూరజ్ రతన్ మాహేశ్వరి అనే ఒకని భార్య కమల భర్త మృతిచెందగా కిందటి శనివారం నాడు చితిలో సహగమనం చేసింది.

సహగమనం నిషిద్ధమైనందువల్ల పోలీసు అధికారులకు తెలియకుండా రాత్రికి రాత్రి సహగమనానికి ఏర్పాటు జరిగిపోయింది. ఆమాకే తెలిసి ఉదయం పోలీసులు వచ్చేలోగానే సహగమనం జరిగిపోయింది.

1951 తరవాత గ్వాలియర్ లో సహగమనం జరగడానికి ఇది రెండోసారి.

ఈ సహగమనానికి తోడ్పడిన వారిని పట్టుకోడానికి పోలీసులు పరిశోధిస్తున్నారు.

Iris Inks for ALL PENS IN FIVE COLOURS
ఐరిస్ సిరాలు
RECHLAB'S Iris INK
Research Chemical Laboratories, Madras-4, Bangalore-3, New Delhi-1.

2-నిమిషాలు సక్రమంగా తోముకుంటే
కాల్గేట్ టూత్ పౌడర్
మీకు ఈ మూడింటినిస్తుంది
✓కమ్మని వాసన!
✓దంతక్షయం తగ్గుదల!
✓తెల్లని పళ్లు!
COLGATE TOOTH POWDER
ఋజువైన విధానం ప్రారంభించండి నేడే
సత్పలితాలకు దంతవైద్యులు ఆమోదించిన విధానం

AMCO BATTERY
AMCOS for ENDURANCE
AMCO BATTERIES (PRIVATE) LTD., BANGALORE-2
ఏకైక ఏజంట్లు:
... మద్రాసు — బెంగళూరు.

అమెరికా కార్మిక నాయకుడు శ్రీ వాల్టర్ రూథర్, రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ ను సందర్శించి కొన్ని పుస్తకాలను బహూకరించారు.

మద్రాసు రాజాజీ హాలులో, ప్రముఖ వైద్యుడు డా॥ ... ఏప్రిల్ 7 వ ... శ్రీ ప్రకాశం అధ్యక్షతన జరిగింది.

చీరాలలో శ్రీ గుంటూరు శేషయ్యా పశువుల ఆసుపత్రికి శ్రీ కంగుల ఓబులరెడ్డి ప్రారంభోత్సవం చేసినప్పుడు.

# హైదరాబాదులో సంస్కృత కళాశాల

## తిరుపతి దేవస్థానం తరపున ఏప్రిల్ 17న ప్రారంభం

తిరుపతి, ఏప్రిల్ 8: ప్రస్తుతం హైదరాబాద్ లో ఉన్న సంస్కృత పాఠశాలను మూసివేసి, దానికిబదులు తిరుపతి దేవస్థానం ఆధ్వర్యాన సంస్కృత కళాశాలను ఈ నెల 17 వ తేదీన ఏర్పాటుచేస్తారు. దేవాదాయ ధర్మాదాయాలశాఖ మంత్రి శ్రీ కె చంద్రమౌళి నేడు పత్రికా విలేఖరులకు ఈ విషయం చెప్పారు.

హైదరాబాద్ లో ఏర్పాటు చేయనున్న సంస్కృత కళాశాలలో శిరోమణి వరకు తరగతులుంటవి.

హైదరాబాద్ రాష్ట్ర ముఖ్యమంత్రి డా॥ బి రామకృష్ణరావుతో ఇటీవలనే యీ విషయం మాట్లాడానని సంస్కృత కళాశాలను హైదరాబాద్ విశ్వవిద్యాలయానికి అనుబంధించి, ఆ రాష్ట్రప్రభుత్వం ఆర్థికసహాయమిస్తారనికూడా శ్రీ చంద్రమౌళి చెప్పారు.

కళాశాలకు భవనాలను కట్టించేందుకు హైదరాబాద్ లోని తిరుపతి దేవస్థానం సమాచారశాఖ కార్యాలయం ప్రక్కన స్థలాన్ని దేవస్థానం సేకరించారు. భవన నిర్మాణానికి సహాకరిస్తానని చాలామంది వాగ్దానం చేశారనికూడా మంత్రి వివరించారు.

## ధర్మకర్తల సంఖ్య తగ్గింపు

### పనికి వీలుగా

తిరుపతి దేవస్థానం ధర్మకర్తల సంఘ సభ్యుల సంఖ్యను ఇప్పటికంటే తగ్గించి బాగా పనిచెయ్యడానికి వీలుగా ఇప్పటికంటె ఎక్కువ అధికారాలు ఆ సంఘానికి ఇవ్వడానికి అనుకూలంగా దేవాదాయ ధర్మాదాయాల చట్టానికి సవరణ ప్రతిపాదించనున్నానని శ్రీ చంద్రమౌళి చెప్పారు.

సంస్కృతభాషావికాసానికి మంత్రి చేస్తున్న అవిరళకృషిని ప్రశంసించుతూ తిరుపతి యువజన కాంగ్రెసు తరఫున శ్రీ పి. మునిరెడ్డి సమర్పించిన విజ్ఞప్తికి సమాధానం చెబుతూ పై విషయం వెల్లడించారు.

విజ్ఞప్తిలో ఇంకా ఇట్లా ఉన్నది: "శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో సంస్కృతం బి.ఏ. తరగతులను ఏర్పాటు చేయించాలి. తిరుపతి దేవస్థానం ధర్మకర్తల సంఘంలో చాలా కాలంనుంచి ఖాళీగాఉంటున్న స్థానాలలో సభ్యులను నియమించాలి. తిరుపతి దేవస్థానం కొత్తగాకట్టించే భవనాలలో కొన్నింటిని తిరుపతి తిరుచానూరుల మధ్య నిర్మిస్తే రెండు పట్టణాలు అభివృద్ధి అయ్యే అవకాశం ఉంటుంది. దేవస్థానం సత్రానికి ప్రక్కన ఉన్న గోవింద రాజస్వామి పుష్కరిణిలో నీరు నిలవచేరి మురిగి అనారోగ్యానికి కారణమవుతున్నది. కనుక ఆ చెరువును బాగుచేయించి సరిగ్గా నిర్వహణ జరిగేటు చూడమని దేవస్థానాన్ని ఆదేశించాలి."

సంస్థ సభ్యులెంతమంది అనే దానికంటే సంస్థ ఎంత మంచిపని చేసిందనే విషయం తనకు ముఖ్యమని ప్రస్తుత తిరుపతి దేవస్థానం ధర్మకర్తల సంఘం బాగా పనిచేస్తున్నది కనుక ఖాళీగా ఉన్న స్థానాలలో సభ్యులను నియమించ వలసిన అవసరం తనకు కనిపించడం లేదని మంత్రి సమాధానమిచ్చారు. ధర్మకర్తల సంఖ్యను తగ్గించి ఇంకా బాగా పని చెయ్యడానికి వీలుగా ఇప్పటికంటె ఎక్కువ అధికారాలు వారికి ఇవ్వడానికి అనుకూలంగా దేవాదాయ, ధర్మాదాయాల చట్టానికి సవరణ తీసుకవస్తా మనుకుంటున్నానని కూడా మంత్రి చెప్పారు. తిరుచానూరు పంచాయతీని తిరుపతి పురపాలక సంఘంలో కలిపివేసే విషయం అక్కడి ప్రజలే నిర్ణయించాలన్నారు. గోవిందరాజస్వామి పుష్కరిణి విషయమై దేవస్థానం కార్యనిర్వహణాధికారికి వ్రాస్తామన్నారు.

# దారిద్ర్య నిర్మూలనకు సహజ సంపద

## ఇంజనీర్లకు రాష్ట్రపతి ఉద్బోధ

పాటియాలా, ఏప్రిల్ 9: దేశంలోని సహజ సంపదను పూర్తిగా వినియోగించి, దారిద్ర్యం, క్షామం, అనారోగ్యం, అజ్ఞానాలను నిర్మూలించి తీరాలని ప్రభుత్వం దీక్ష వహించిందని రాష్ట్రపతి శ్రీ రాజేంద్రప్రసాద్ థప్పర్ సాంకేతిక శిక్షణాలయ భవనానికి శంకుస్థాపన చేస్తూ అన్నారు.

ఈ విద్యాలయానికి ప్రసిద్ధ పారిశ్రామిక వ్యాపారులు శ్రీ కరమ్ చంద్ థప్పర్ రు. 30 లక్షలు విరాళ మిచ్చారు. మిగిలిన ఖర్చును పెప్సు ప్రభుత్వం భరిస్తుంది.

రెండో పంచవర్ష ప్రణాళిక సఫలం కావాలంటే సాంకేతిక నిపుణుల దీక్ష, ప్రజల సహకారం అవసరమని రాష్ట్రపతి అన్నారు.

సాయంకాలం బహిరంగ సభలో ప్రసంగిస్తూ రాష్ట్రపతి ప్రజలు ఐక్యభావంతో ఉండాలని బోధించారు.

పంజాబురాష్ట్ర పునర్నిర్మాణ సమస్య పరిష్కారమైనందుకు పంజాబు, పెప్సు ప్రజలను రాష్ట్రపతి అభినందించారు.

ఇంతకుముందు లూధియానా పురపాలక సంఘం రాష్ట్రపతికి సౌరసన్మానం ఇచ్చింది. ఈ సందర్భంలో రాష్ట్రపతి ప్రసంగిస్తూ, నైతిక, ఆధ్యాత్మిక దృష్టి కూడా నేటి సమాజంలో స్థయిర్యం చేకూర్చడానికి అవసరమని చెప్పారు. సకల మతాలకూ ప్రాతిపదికలైన యీ నైతిక దృక్పథం వల్లనే మానవ సమాజం సుస్థిరంగా నిల్చి ఉందన్నారు.

పాటియాలాలోకూడా మరో ఇంజనీరింగు సంస్థకు రాష్ట్రపతి రేపు శంకుస్థాపన చేస్తారు.

రాష్ట్రపతి ఇవాళ ఢిల్లీనుంచి విమానంలో ఇక్కడికి వచ్చారు.

## చెరుకుపంటలో పోటీ

### తణుకు ప్రాంతంలో శ్రీ సత్తిరాజుకు బహుమతి

తణుకు, ఏప్రిల్ 8: ఆంధ్రషుగర్స్ పంచదార ఫ్యాక్టరీకి ప్రత్యేకించిన చెరుకుపంట ప్రాంతంలో, ఎకరానికి 65 టన్నుల చెరుకు పండించినందుకు, శ్రీ పాతపాటి సత్తిరాజుకు జిల్లా వ్యవసాయాధికారి, శ్రీ జగన్నాథరావు, ఒక పతకము రు. 200 నగదు బహూకరించారు.

మార్చి 31 న ఫ్యాక్టరీ ఆవరణలో, శ్రీ ముళ్ళపూడి హరిశ్చంద్రప్రసాద్ అధ్యక్షతన సభ జరిగింది. సభకు చెరుకు రైతులు చాలామంది వచ్చారు. ఈ ఫ్యాక్టరీకి ప్రత్యేకించిన ప్రాంతము చెరుకు రైతులసంఘ అధ్యక్షుడు, శ్రీ చిట్టూరి వెంకటరత్నము సభను ప్రారంభించారు. ఫ్యాక్టరీ వ్యవసాయ విభాగపు ఉద్యోగి శ్రీ తాళ్లూరి లక్ష్మీపతి చెరుకు సాగులో అధికోత్పత్తి మార్గాలను వివరించారు. శ్రీ పాతపాటి సత్తిరాజు, ఎకరానికి 65 టన్నులు పండించడంలో తాను అవలంబించిన విధానాన్ని తెలియజేశారు.

## గోదావరిలో బాలుని దుర్మరణం

భద్రాచలం, ఏప్రిల్ 6: కృష్ణతోకి 18 సంవత్సరాల బాలుడు, నిన్న స్నేహితులతో కలిసి గోదావరి స్నానానికి వెళ్ళి, నదిలో మునిగిపోయాడు. నదిలో ఎంత వెతికినా అతని జాడ తెలియలేదు.

ఈబాలుడు, భద్రాచలం తాలూకా సిరస్తాదారు మేజిస్ట్రేటు శ్రీ డి. ఎల్. దాసు మనుమడు.

కొద్దిరోజుల క్రితం, ఒక రజక స్త్రీ చంటి పిల్లను ఒడ్డున ఉంచి, బట్టలు ఉతుకుతూ ఉండగా, చంటి పిల్ల నదిలో పడి కొట్టుకొనిపోయింది.

మాజ్డా దీపములు (ఇండియా తయారీ)
ఎక్కువకాలము ప్రకాశవంతముగా వెలుగును
Mazda
జి ఇ సి ..... చెందిన దీపములు
అసోసియేటెడ్ ఎలెక్ట్రికల్ ఇండస్ట్రీస్ (ఇండియా) లి.,
కలకత్తా, బొంబాయి, క్రొత్త ఢిల్లీ, మద్రాసు, బెంగుళూరు, కోయంబత్తూరు, నాగ్ పూర్
AIX-126 TQ

గ్రామాలలో నీటి సప్లయికి
కిర్లోస్కర్ చేతి పంపులు
కిర్లోస్కర్ చేతి పంపులు 'కావేరి' అండ్ 'గంగా' ఇక్కడకు ...
మిగిలిన వివరాలకు వ్రాయండి.
KAVERI
కిర్లోస్కర్ బ్రదర్స్ లిమిటెడ్. కిర్లోస్కర్ వాడి, డి. సతారా.

సురాజ్ మల్స్ కు
మీరు వెళ్ళినప్పుడు ఆనందించలేదా?
నగ కట్టులో కొత్తకొత్త రకాలు,
ఫ్యాషన్లు.....
మీకు ఏమి కావలసివున్నా ఇండియాలో రత్న వర్తకులకు నైజాతికులైన సురాజ్ మల్స్ కు వెళ్లడంకంటే మీరు చెయుగలిగింది లేదు.
60 ఏళ్ల క్రితం వ్యాపారం ప్రారంభించినప్పటినుంచి, ఎవరికైనా ఒకటేధర చెప్పడంలో సురాజ్ మల్స్ పేరుగాంచిన సంగతి లోకవిదితం.
ఫోన్ 2250 Surajmals PIONEERS OF INDIA'S JEWEL TRADE 313, ESPLANADE, MADRAS టెలిగ్రాము "మెరిండి"
సురాజ్ మల్స్ ఇండియాలో రత్నాల వ్యాపారంలో నైజాతికులు 313, ఎస్ప్లనేడ్, మద్రాసు.
ధరలు తగ్గించి అమ్మేలంటివాటు మాకు లేదు. ఎందుచేతనంటే మాధరలు ఎప్పుడూ ఒకే మోస్తరుగా వుంటవి కనుక.
1895 నుంచి 1956 వరకు 61 ఏళ్లుగా సేవచేస్తున్నారు. Grant. MS. 54

## గంటల పంచాంగం

శ్రీమన్మథ సం॥ ఫాల్గుణ బ॥ అమావాస్య 1956- సం॥ ఏప్రిల్ 11 బుధవారం బ॥ అమావాస్య 8-6 శే వ 11-41 వర్జ్యం లేదు.

శ్రీ దుర్ముఖినామ సం॥ చైత్రమాసం శు॥ ప్రథమ ఏప్రిల్ 12 గురువారం శు॥ ప్రథమ 6 38 ద్వితీయ రా 4-51 అశ్వ 10-52 వర్జ్యం 7-0 ల 8-33 కు, వర్జ్యం 20-2 ల 21-38 కు.

ఆంధ్రపత్రిక

ఒరు లేయని యొనరించిన
వరవర యత్రియము తన మనంబున కగు దా
వారలకు వరి సేయకునికి
వరాయణము వరమధర్మపథములం శెల్లన్
(మహాభారతము)

శ్రీ మన్మథ సం॥ ఫాల్గుణ బ॥ అమావాస్య
బుధవారం

## కాశ్మీర్ సమస్య

విషయం చిన్నదైనా, పెద్దదైనా పెద్ద పెట్టున నానా హంగామా చేయడం పాకిస్థాన్‌కు పరిపాటి అయిపోయింది. కాశ్మీర్ విషయంలో కరాచీ పాలకులు ప్రస్తుతం సాగిస్తున్న విష ప్రచారం, ఆర్భాటపు ప్రకటనలు ఇందుకు ఏ మాత్రం భిన్నంగా లేవు. గత ఏడెనిమిది సంవత్సరాలలోనూ ఈ సమస్య పరిష్కారం కాకుండా అడుగడుగునా అడ్డుపడుతూ వచ్చింది పాకిస్థానే. న్యాయసమ్మతమైన ఏ ప్రతిపాదనలు జరిగినా వాటిని వరసగా తిరస్కరిస్తూ వచ్చింది పాకిస్థానే. 'సందర్భానందర్భా'లను సైతం లెక్క చేయకుండా భారతదేశంపై అప్రస్తుతమైన, నిరాధారమైన ఆరోపణలు చేయడానికి కూడా పాక్ పాలకులు ఎన్నడూ సంకోచించలేదు. ఆ ఆరోపణల బండారమంతా కాశ్మీర్ సమస్యపై సమితి సాగించిన చర్చలలో స్పష్టపడిపోయింది. కాశ్మీర్‌పై దురాక్రమణ సాగించి, అక్కడి ప్రజలకు సంక్షోభాన్ని తెచ్చిపెట్టింది పాకిస్థానే అని కూడా ధృవపడిపోయింది. కాశ్మీర్ భూభాగంలో తమ సేనల ఉనికిని పాకిస్థాన్ ప్రతినిధులు ఏ విధంగానూ సమర్థించుకోలేకపోయినారు. కాశ్మీర్‌లో యుద్ధవిరమణ సరిహద్దుకు ఆవల, ఈవల వుండవలసిన పాకిస్థాన్, భారతదేశాల సేనల సంఖ్యాబలం విషయంలో 1952 డిసెంబరులో మధ్యవర్తి సర్ ఫ్రాంక్ గ్రాహం చేసిన సక్రమ ప్రతిపాదనలను భారతదేశం అంగీకరించినా, పాకిస్థాన్ తిరస్కరించింది. పాక్ సేనల సంఖ్య 8 వేలకు మించరాదనీ, భారతసేనలు 21 వేల వరకూ వుండవచ్చుననీ సూచిస్తే, ఆ సూచన చేసే అధికారం గ్రాహంకే లేనే లేదని పాకిస్థాన్ వాదించింది. జనవాక్య సేకరణద్వారా గాని, తదితర సవ్యమార్గాల ద్వారా గాని ఏ పరిష్కారం జరిగినా, అది తమకు అనుకూలంగా వుండదనే భయంవల్లనే కరాచీ పాలకులు మొదటినుంచీ ఒకవిధమైన మొండి ధోరణిని అవలంబిస్తూ వచ్చారు. భద్రతా సంఘం ఎదుట ఈ సమస్యపై తిరిగి ఫిర్యాదు చేయాలని పాక్ నాయకులు సంకల్పించడంలో ఉద్దేశం కూడా గత చరిత్రను ప్రజల దృష్టినుంచి మభ్యపరచాలన్నదే.

భారతదేశంలో కాశ్మీరు విలీనాన్ని జనవాక్య సేకరణ ద్వారా నిర్ధారణ చేయవలసిన అగత్యం 'చాలావరకు' లేదనే తాను అభిప్రాయపడుతున్నట్లు ప్రధాని నెహ్రూ ఇటీవల ప్రకటించడంతో పాకిస్థాన్ నాయకుల గంగవెర్రులు మరీ ఎక్కువైనవి. హృదయపూర్వకంగా తాము సమస్యాపరిష్కారాన్ని మాత్రమే వాంఛిస్తున్నట్లయితే, ఈ విషయంలో పాక్ పాలకులు ఇంత ఆర్భాటం చేయవలసిన అగత్యమే లేదు. ముఖాముఖి చర్చలద్వారా శాంతియుతంగా సమస్యను పరిష్కరించుకోడానికి తాము సర్వదా సంసిద్ధమేనని భారత ప్రధాని అనేకసార్లు స్పష్టంగా ప్రకటించే వున్నారు. పైగా, ఉభయ దేశాలమధ్య వివాదాల సర్దుబాటుకు యుద్ధం మార్గం కాదని కూడా శ్రీ నెహ్రూ పదే పదే సలహా ఇచ్చారు. 'నిర్యుద్ధ ఒప్పందం' అవసరమనే ప్రతిపాదనను ప్రప్రథమంగా చేసింది ప్రధాని నెహ్రూయే. వీటిని పాకిస్థాన్ మరచిపోయినట్లు నటించినా, మిగతా ప్రపంచం మరచిపోలేదు.

దండిగా సప్లయి అవుతున్న అమెరికన్ ఆయుధాల అండతో అదను దొరకగానే కాశ్మీర్‌పై తిరిగి దురాక్రమణకు ఉపక్రమించాలని ఉవ్విళ్లూరుతున్నది పాకిస్తాన్. వాస్తవ పరిస్థితి ఈ విధంగా వుండగా, భారతదేశం తమ సరిహద్దులలో సైనికబలాల కేంద్రీకరణం సాగిస్తున్నదని ప్రచారం చేసినందువల్ల చేకూరే ప్రయోజనమేమీ వుండబోదు.

పాకిస్తాన్ శాంతిసౌఖ్యాలను త్రికరణశుద్ధిగా కాంక్షించే దేశం ప్రపంచంలో ఏదైనా వుంటే, అదొక్క భారతదేశమే ననే విషయాన్ని పాక్ నాయకులు మరువకూడదు. ఇరుగు పొరుగున వున్న రెండు దేశాలు సఖ్యతతో మెలగినప్పుడే, ఉభయత్రా అభివృద్ధి సాధ్యపడుతుంది. అందుచేత, అనవసర ఆర్భాటాన్ని కట్టిపెట్టి, కాశ్మీర్‌తోపాటు, ఇతర సమస్యల పరిష్కారానికి వీలైన శాంతియుత వాతావరణాన్ని పాకిస్తాన్ నాయకులు కల్పించడానికి ప్రయత్నించాలి. సమితికి తిరిగి ఫిర్యాదు చేయబోయే ముందు లోగడ జరిగిన ప్రయత్నాలన్నీ ఏవిధంగా వ్యర్థమైపోయినవో వారు గ్రహించాలి.

## ఒరిస్సా ఆంధ్ర ప్రాంతాలు

### ఆంధ్రలో కలపనందుకు విచారం

శ్రీకాకుళం, ఏప్రిల్ 9: ఈ పురపాలక సంఘ ప్రత్యేక సమావేశంలో, ఒరిస్సాలోని పర్లాకిమిడి, గుణుపురం, కోరాపుట్ వగైరా తెలుగు ప్రాంతాలను ఆంధ్రలో చేర్చనందుకు, విచారం వెల్లడిస్తూ తీర్మానించారు. ఈ సమావేశం మెంబర్ 6 వ తేదీన శ్రీ ఇప్పిలి లక్ష్మీనారాయణ అధ్యక్షతన జరిగింది.

అవసరమనుకొంటే, పైన పేర్కొన్న ఒరిస్సా ఆంధ్ర ప్రాంతాలలోనూ, బళ్ళారి, సిరిగుప్ప, హోస్పేట తాలూకాలలోనూ, జనవాక్యం తెలుసుకొని, వాటిభవిష్యత్తు నిర్ణయించాలని, కేంద్ర ప్రభుత్వాన్ని తీర్మానంలో అభ్యర్థించారు.

ఫజలాలీ సంఘంవారు, బళ్ళారిలోని మూడు తాలూకాలను ఆంధ్రలో కలపాలని నిష్పక్షపాతంగా సిఫార్సు చేసినా కేంద్ర ప్రభుత్వం ఆ సిఫార్సును అంగీకరించక వాటిని మైసూరులో ఉంచుటకు నిర్ణయించడం, ఆఖరుకు ఆంధ్ర ప్రభుత్వపు కనీసపు కోర్కెనుకూడా అంగీకరించకపోవడం శోచనీయం. కాబట్టి, యీ సమస్యను కేంద్రప్రభుత్వం పునరాలోచించాలనితీర్మానంలో కోరారు.

---

నికోసియా, ఏప్రిల్ 9: నికోసియా విమానాశ్రయంలోనూ, కర్షన్స్, అరో గ్యశాఖలలోను ఉన్న సైప్రస్ వాస్తవ్యులందరినీ బ్రిటిష్ ప్రభుత్వం తొలగించి బ్రిటిష్ విమానదళోద్యోగులను ఆ పదవుల్లో నియమించింది.

## త్వరలో గరిష్ఠ కమతాల నిర్ణయం

(1 వ పేజీ 8 కాలం తరువాయి)

లేదని విమర్శిస్తూ, గత మూడు నాలుగేళ్లలో రైతుల స్థితి మరింత పాడయిందని ఆరోపించారు. ఇది నిజం కాదు దారిద్ర్యాన్ని పదేళ్లలో పూర్తిగా నిర్మూలించే సంజీవి మా దగ్గర లేదని మాత్రం ఒప్పుకుంటాము.

ఇటీవల కొన్నేళ్లుగా ఆహారోత్పత్తి పెరగటానికి కారణం అనావృష్టి తొలగిపోవటమేనని కొందరు సభ్యులు అన్నారు. ఇది పూర్తిగా నిజం కాదు. వరదలు, తుఫానులు మొదలైన అవాంతరాలు వచ్చినా, ఉత్పత్తి పెరుగుదల నిలకడగా సాగటం గమనించదగింది.

### ధరల తోడ్పాటు

వ్యవసాయోత్పత్తుల ధరలు పడిపోకుండా నిలబెట్టేందుకు ప్రభుత్వం తీసుకున్న చర్యలు జయప్రదమయినవని చెప్పవచ్చును. ధరల తోడ్పాటుకు ప్రభుత్వం కొనవలసి వచ్చిన సరుకులు చాలా కొద్దిగానే ఉన్నవనే సంగతి ఈ అంశాన్ని నిరూపిస్తున్నది. ఎక్కువ డబ్బు వెచ్చించకుండా ప్రభుత్వం ధరలను నిలబెట్ట కలిగిందంటే ప్రశంసించ తగిన విషయమే. ద్రవ్యోల్బణంవల్ల ధరలు పెరిగిపోతున్నవని వ్యాపార వర్గాలు - ముఖ్యంగా సట్టా వ్యాపార వర్గాలు (స్పెకులేషన్) - చెపుతున్నారు. గత అక్టోబర్ 28 నుంచి మార్చి 25 వరకూ ఎక్కువ కరెన్సీ చెలామణీలో ఉన్నమాట నిజమే. ఇది కొంతవరకు ఎగుమతి, దిగుమతి విధానాల సర్దుబాటువల్ల జరిగింది. రిజర్వుబ్యాంకు పరిస్థితుల్ని కనిపెట్టి ఉన్నది. ప్రస్తుతం ధరలు విపరీతంగా పెరిగిపోయే ప్రమాదం కూడా లేదు.

అవాంతరాలను అడ్డేందుకు ప్రభుత్వం పది లక్షల టన్నుల బియ్యాన్ని, పది లక్షల టన్నుల గోధుమనీ నిలవ చేయ నిశ్చయించింది. ఇది ఈ దేశపు ఉత్పత్తి నుంచే సేకరించటం జరుగుతుంది.

అంతర్జాతీయ గోధుమ ఒప్పందంలో మూడేళ్లపాటు చేరటానికి భారత ప్రభుత్వానికి అభ్యంతరం లేదు. కాని కొనటం మాత్రం ధరలమీదనే ఆధారపడి ఉన్నది. గోధుమ ఎగుమతి దేశాలు అనవసరంగా పెంచి ఉంచుతున్నారని మా నమ్మకం.

### భూ సంస్కరణలు

భూసంస్కరణలు జరపటానికి ప్రభుత్వంచేసిన ప్రయత్నాలు అంత జయం పొందలేదని నేను అంగీకరిస్తాను. కొన్ని ప్రాంతాల్లో ఈ సంస్కరణ ప్రయత్నాలవల్ల శోచనీయ సంఘటనలు జరిగినవి. ఈ సంస్కరణలవల్ల రక్షణ పొందిన కౌలుదారులనే చాలామందిని భూములనుంచీ తొలగించటం జరిగింది. ఇది హైదరాబాదులో ఎక్కువగా జరిగింది. ఈ తొలగించటం సందర్భంలో కౌలుదారులే భూములను స్వయంగా వదిలివేసుకున్నారని చెప్పించటం జరిగింది. వీటిని గుర్తించకుండా, కౌలుదార్లను తిరిగి భూముల్లో ప్రవేశపెట్టేందుకు ప్రభుత్వం చర్యలు తీసుకుంటున్నది.

### గరిష్ఠ భూవసతి

గరిష్ఠ భూవసతి నిర్ణయం విషయంలో వ్యవహారం బాగానే ముందుకు సాగింది. కొందరు సభ్యులు గరిష్ఠ ప్రమాణం నిర్ణయించరాదని ప్రతిఘటిస్తున్నారు కాని, గరిష్ఠ ప్రమాణాన్ని—చాలా తక్కువలో నిర్ణయించాలని నేను గట్టి పట్టుదలతో ఉన్నాను.

### ముప్పాతిక ప్రజలకు అయిదెకరాల లోపే

దేశంలో జరిపిన మచ్చు విచారణలవల్ల రైతుల్లో ముప్పాతిక మందికి అయిదెకరాలలోపే భూమి ఉన్నట్లు తేలింది.

మొత్తం 9 రాష్ట్రాల్లో గరిష్ఠ భూవసతి ప్రమాణాన్ని నిర్ణయిస్తూ శాసనాలు జరిగినవి. ఆరాష్ట్రాలు ఇవి-పంజాబు, పశ్చిమ బెంగాల్, హైదరాబాదు, జమ్మూ-కాశ్మీర్, హిమాచల్ ప్రదేశ్, ఉత్తర ప్రదేశ్, మధ్యభారత్, సౌరాష్ట్ర, ఢిల్లీ రాష్ట్రాలు. మొదటి అయిదు రాష్ట్రాలలోనూ ప్రస్తుతం ఉన్న భూవసతులకు కూడా గరిష్ఠ ప్రమాణాలు అమలు జరపబడినవి. మిగిలిన నాలుగు రాష్ట్రాల్లో ఇక ముందు సంపాదించే భూవసతులకు మాత్రం అమలు జరుపుతున్నారు. వివరాల సేకరణ పూర్తికాగానే దేశమంతటా గరిష్ఠ ప్రమాణం అమలు జరుగుతుంది.

### సహకార సాగుబడి సంఘాలు

రెండో పంచవర్ష ప్రణాళిక కింద సహకారసాగుబడి సంఘాలు ఏర్పాటు చేస్తాము. రైతు తన వాటాను పూర్తిగా చెల్లించలేకపోతే, ప్రభుత్వం ఆ కొరతను భర్తీచేసి, స్వల్ప మొత్తాలలో వాయిదాలమీద రాబట్టుకుంటుంది. ఇంక మీదట రైతులకు రాబోయే పంట హామీమీద అప్పులు ఇస్తారు. అప్పులను ఉత్పత్తి అవసరాలకు ఇచ్చేటప్పుడు ఎరువులు, విత్తనాలు మొదలైన వస్తువుల రూపంలో ఎక్కువగానూ, రొక్కరూపంలో తక్కువగానూ ఇస్తారు.

కొనుగోలుపత్తి ధరలు మారటమన్నది గిడ్డంగులు ఏర్పాటుచేయటంవల్ల సాధ్యపడుతుంది.

దేశంలో ఇప్పటికి వెయ్యి సహకారసాగుబడి సంఘాలు ఏర్పాటయినవి. అవి అంత జయప్రదంగా లేవు.

---

చైనాలో ఈ సంఘాలు పనిచేసే పద్ధతిని పరిశీలించేందుకు ఒక ప్రతినిధి వర్గాన్ని పంపాలనుకుంటున్నాము. చైనాలో పరిస్థితులు భిన్నంగా ఉండవచ్చును కాని, వారి అనుభవాలను తెలుసుకుని, మన సంఘాలను అభివృద్ధి చేసుకునేందుకు అవి తోడ్పడగలవు."

శ్రీ జైన్ ఈ వివరణచేసినమీదట లోక్‌సభ ఆహార వ్యవసాయశాఖ పద్దులని ఆమోదించింది

చర్చలో శ్రీ టి. ఎన్. విశ్వనాథరెడ్డి వివిధ పంటల ఉత్పత్తి ఖర్చులను దర్యాప్తుచేసేందుకు ప్రభుత్వం ఒక సంస్థను నిర్మించాలని సూచించారు. రాయలసీమలో ప్రతిసంవత్సరం వానలు సరిగాపడవు కనుక, చిన్న నీటి వనరును ఉపయోగంలోకి తీసుకునిరావాలన్నారు.

హైదరాబాద్ ప్రతినిధి శ్రీ అహమద్ మొహియుద్దీన్ సహకార సాగుబడి సంఘాలను ప్రభుత్వం ప్రోత్సహించాలని అన్నారు. శ్రీ కె. సుబ్బారావు (ఆంధ్ర) మాట్లాడుతూ ప్రభుత్వం ధరల విషయంలో ఒక కచ్చితవిధానాన్ని అనుసరించి ఉంటే, వ్యవసాయదారులను నిలకడచేసి ఉంచవచ్చునన్నారు.

ఉభ్భిలో వ్యవసాయమంత్రి చౌధరి పంజాబ్ రావ్ దేశ్‌ముఖ్ ప్రసంగిస్తూ మొదటి ప్రణాళిక ముగిసేందుకు రెండేళ్లముందే వ్యవసాయోత్పత్తులు ఎన్నడూ లేనంత, స్థాయికి పెరిగినవని అన్నారు. ఆహారధాన్యాలు, జనుము, చెరుకు మొదలైనవాటన్నిటి ఉత్పత్తీ పెరిగిందనీ, జపాన్ సాగుబడి పద్ధతి 16 లక్షల ఎకరాల్లో ప్రవేశపెట్టటం జరిగిందనీ తెలియజేశారు. జపాన్ సాగువల్ల వితైనాలకిందనే 5½ కోట్ల రూపాయలు ఖర్చు కలిసివచ్చిందనీ, 15 లక్షల టన్నుల ధాన్యం అదనంగా ఉత్పత్తి కాగలదనీ అన్నారు.

## పాకిస్తాన్‌కు అమెరికా జెట్ విమానాలు

### త్వరలో సరఫరా ప్రారంభం

కరాచీ, ఏప్రిల్ 9: అమెరికా ఆర్థిక సహాయసంధి ననుసరించి పాకిస్తాన్ విమానదళానికి అమెరికా అతి త్వరలోనే అత్యంత ఆధునికమైన జెట్ విమానాలను ఇతర పరికరాలను సరఫరా చేస్తుందని అమెరికన్ విమానదళానికి చెందిన జనరల్ జాన్ ఒహారా ప్రకటించారు.

జనరల్ జాన్ పాకిస్తాన్ వచ్చి వారంరోజులయింది. ఇవాళ బయలుదేరి పశ్చిమాసియా వెడుతున్నారు.

అమెరికా సహాయమిచ్చే సైనిక పరికరాల వివరాలను తెలపాలని పత్రికా విలేఖరుల ప్రశ్నలకు జనరల్ జవాబివ్వలేదు కాని, అతి ఆధునికమైన జెట్ విమానాలను కూడా పాకిస్తాన్‌కు ఇవ్వగలరని తెలిపారు.

ఈ సరఫరా ఆలస్యమైనమాట నిజమేనని ఒప్పుకుంటూ, ఇంక జాప్యం జరగదని జనరల్ జాన్ చెప్పారు. అలస్యమైనందుకు అసంతృప్తి ఉన్నప్పటికీ, కావలసినన్ని ఆయుధ పరికరాలిస్తున్నారనే తృప్తిమాత్రం పాకిస్తాన్‌కు కలిగిందని చెప్పారు.

అమెరికా పంపించే పరికరాలు నిలవ సరుకులలోనివి కావనీ, నిత్యం అమెరికన్ విమానదళానికి సరఫరా అవుతున్నవానినే పంపుతున్నారనీ వివరీకరించారు.

ఇదివరలో బ్రిటన్ వద్ద తీసుకున్న పరికరాలకు ఇప్పుడు అమెరికా ఇస్తున్న పరికరాలకు కొంత తేడా ఉన్నా కలిపి వాడ్డానికి అంత ఇబ్బంది ఉండదని జనరల్ జాన్ చెప్పారు.

## పార్లమెంటులో ప్రవచనాలు

ఢిల్లీ, ఏప్రిల్ 9:—

నేను పంపించిన అర్జీగతి ఏమైనట్లు?
—శ్రీమతి అన్నిమాస్కరీన్.

ఒక జ్ఞాపికను పంపించమని కోరుతున్నాను.
—శ్రీ మహావీర్ త్యాగి.

దురదృష్టవశాత్తు మన మంత్రులెవ్వరూ మాంసం తినరు
—శ్రీ ఫ్రాంక్ ఆంతోనీ.

తినేదెం - మాంసమే కాదు, మాంసం తినేవారిని కూడా తింటాం.
—శ్రీ యం. వి. కృష్ణప్ప

అట్లా అయితే ఇక నేటుకు బయలు దేరమని సలహా ఇస్తున్నాను.
—శ్రీ ఆంతోనీ.

ఇది ఒక సంగ్రహం—కానీ దీనికి అవీ ఇవీ కలిపి అటుచేసి, దీన్ని ఒక నివేదిక అని అనగలిగేవారమే.
—శ్రీ పి. సి. బిశ్వాస్.

బొగ్గు, నూనె, లిగ్నైట్ కంటే బంగారం ఎక్కువ విలువగలది కాదని మా నమ్మకం.
—శ్రీ కె. డి. మాలవీయ.

సభలో గోష్ఠి మాటలు ఎక్కువైపోతున్నాయి. ఎవ్వరూ వినడములేదు.
—శ్రీ అనంతశయనం అయ్యంగారు.

ఆ దేశాలు సభ్యులు (శ్రీ జైన్ చేస్తున్న హిందీ ప్రసంగం అర్థంకాక) వెలా తేలా బోతున్నారు.
—శ్రీ అయ్యంగారు.

నేనూ తెల్లబోతున్నాను.
—శ్రీ వేలాయుధన్.

## బ్రిటిష్ పాలకులు తీసుకున్న ఆస్తులు

### ఢిల్లీలో త్వరలో భారత పాక్ చర్చలు

కరాచీ, ఏప్రిల్ 9: యుద్ధకాలంలో బ్రిటిష్ పాలకులు తూర్పు-పాకిస్తాన్‌లో స్వాధీనపర్చుకున్న ఆస్తులకు ఇవ్వవలసిన పరిహారం విషయమై భారత ఆర్థికమంత్రితో పాక్ ఆర్థికమంత్రి సంప్రదింపులు జరపడంకోసం అవసరమైన ఏర్పాట్లను చర్చించడానికి త్వరలోనే ప్రభుత్వ కార్యదర్శుల సమావేశం జరుగుతుందని పాక్ ఆర్థికమంత్రి శ్రీ అమ్జదాలీ పాకిస్తాన్ పార్లమెంటులో ఒక ప్రశ్నకు జవాబిస్తూ తెలియచేశారు.

ఆర్థికమంత్రులు, ఈ విషయాన్నీ, రెండు దేశాల మధ్య ఇంకా పరిష్కారం కావలసిన ఆర్థికాంశాలనూ కూడా చర్చించవలసి ఉందని కూడా చెప్పారు.

పై ఆస్తులకు పరిహారం పరంగా దాదాపు ఆరున్నరకోట్ల రూపాయలు ఉంటుందని అంచనా వేసినట్లు శ్రీ అమ్జదాలీ చెప్పారు.

ఇంతవరకూ ఆర్థిక మంత్రుల సమావేశానికి అవకాశం లేకపోయిందనీ, త్వరలో ఏర్పాట్లను గురించి చర్చలు జరుగుతాయనీ చెప్పారు.

## పాక్ ఎల్లల్లో భారతసేనలు?

### కరాచీ నిరసన

కరాచీ, ఏప్రిల్ 9: పశ్చిమ పాకిస్తాన్—భారత సరిహద్దుల్లో భారత దేశంవైపున భారత సేనల్ని కేంద్రీకరిస్తున్నారని ఆరోపిస్తూ, పాకిస్తాన్ ప్రభుత్వం భారతప్రభుత్వానికి ఇవాళ ఉదయం నిరసన తెలిపింది.

ఈ సైన్యాలను "శాంతి కాలపు" స్థావరాలకు తిరిగి తరలించవలసిందిగా భారతప్రభుత్వాన్ని పాక్ ప్రభుత్వం అడిగింది.

సరిహద్దుల్లో కేంద్రీకరించిన భారత సైన్యాలు మరీ అధికంగా ఉన్నాయని పాకిస్తాన్ విదేశాంగశాఖాధికారి చెప్పారు. ముఖ్యంగా ఇటీవల సంఘర్షణలు సంభవించినచోట్ల భారతసైన్యాలను అధికంగా చేర్చారని చెప్పారు.

అయితే పాకిస్తాన్‌మాత్రం తన సరిహద్దుల్లో సరిహద్దు గస్తీదళాల్నిమాత్రమే ఉంచిందని చెప్పారు. పాకిస్తాన్ తన సరిహద్దుల్లో తన సైన్యాలను కేంద్రీకరించలేదని చెప్పారు.

### పాక్ రాయబారి నివేదిక

కిందటి శుక్రవారంనాడు ఢిల్లీలో భారతప్రధానితో కాశ్మీరు సమస్యపై జరిపిన చర్చలలోని అంశాలను నివేదించడానికి పాకిస్తాన్ ప్రధాని భారతదేశంలోని పాకిస్తాన్ రాయబారి శ్రీ గజన్‌ఫరాలీఖాన్‌కు కరాచీ రమ్మని కబురు పంపారు.

కాశ్మీరు సమస్యపై ప్రత్యక్ష రాయబారాలకు అవకాశం లేదని తానెన్నడూ త్రోసిపుచ్చలేదని భారత ప్రధాని శ్రీ గజనఫరాలీతో చెప్పారట.

శ్రీ గజన్ఫరాలీ తూర్పు పాకిస్తాన్ పర్యటన మధ్యలో చాలించుకొని బుధవారంనాటికి కరాచీ వెడుతున్నారు.

## జంతు ప్రదర్శనవనం ఏర్పాటు

### హైదరాబాదుకు ప్రవీణుని రాక

హైదరాబాదు, ఏప్రిలు 9: జంతువులకు వాసయోగ్యమైన వనముల యేర్పాటుచేయడంలో ప్రపంచ ప్రసిద్ధి వహించిన కారల్ హెన్రిచ్ హాగెన్‌బెక్ రేపు యిక్కడికి వస్తున్నారు.

హుస్సేన్‌సాగర్ కట్టకు పారిశ్రామిక ప్రాంతానికి మధ్యనవున్న 240 ఎకరాలవిస్తీర్ణంలో, జంతుప్రదర్శనవనము నిర్మించడానికి, యీయనను హైదరాబాదు ప్రభుత్వం పిలవనంపింది.

ఇప్పుడు జంతుప్రదర్శనవనం, పబ్లిక్ గార్డెన్స్ నానుకునిఉన్నది. ఒకప్పుడు భారతదేశమంతటిలోనూ, ఇదే చాలా అందమైనదిగా పేరుపొందింది. కాని అనేక కారణాలవల్ల ఇప్పుడీస్థితికి దిగజారింది.

రాష్ట్రప్రభుత్వం జంతుప్రదర్శనవనము పునర్నిర్మించాలని నిర్ణయించి, అందుకు హుస్సేన్‌సాగర్ కట్ట, పారిశ్రామిక ప్రాంతం మధ్యనున్న 240 ఎకరాల విస్తీర్ణం ఏర్పాటు చేసింది. ఈ స్థలం పరిశీలించడానికే కారల్ హెన్రిచ్ రేపు వస్తున్నాడు.

## శ్రీ నెహ్రూ శ్రద్ధ: ఫ్రెంచి క్షమార్పణ

1వ పేజీ 8 వ కాలం తరువాయి

దేశాలు చివరకు తమతో స్నేహంగా ఉన్న ఇతర పాశ్చాత్య దేశాలుకూడా నిరసిస్తున్న సమయంలో శ్రీ నెహ్రూ మాత్రం ఈ పరిస్థితిలోఉన్న చిక్కులను గ్రహించాలని తెలియజేయటంతోనే కొండెక్కినంత సంబరం కలిగిందనీ వీరు తమవిధానాన్ని సైనికంగా బలపరుస్తున్నట్లు తాము గ్రహించామనీ ఫ్రెంచి ప్రభుత్వం తెలియజేసింది.

## అల్జీరియాలో క్లిష్టపరిస్థితి

### ఫ్రెంచి మంత్రివర్గం చర్చ

పారిస్, ఏప్రిల్ 9: అల్జీరియాలో నానాటికీ క్లిష్టమైపోతున్న పరిస్థితిని గురించి ఫ్రెంచిప్రధాని శ్రీ మోలే మంత్రిమండలిలోని ప్రధాన సహచరులతో నేటి మధ్యాహ్నం 4 గంటలసేపు చర్చించారు. బుధవారం అధ్యక్షుడు కోటి అధ్యక్షతన జరిగే మంత్రిమండలి సమావేశంలో నిర్ణయాలు జరుగుతవి.

రాడికల్ ప్రతినిధి శ్రీ మెండెస్ ఫ్రాన్స్ కానీ, ఇతర మంత్రులెవరయినా కానీ అల్జీరియా విధానంపట్ల నిరసనగా రాజీనామా చేస్తామని చెప్పారా అని విలేఖరులడగా ప్రభుత్వ ప్రతినిధి వారు అట్లా చెప్పలేదని అన్నారు. అయితే కొందరు మంత్రులు మాత్రం ప్రభుత్వ విధానాన్ని పూర్తిగా ఆమోదించటం లేదని అన్నారు.

### పోరాటాలు

అల్జీరియా-ట్యునీషియా సరిహద్దుల దగ్గర నెమెంచా కొండల్లో అల్జీరియా జాతీయవాదులకూ, ఫ్రెంచి సేనలకూ జరుగుతున్న పోరాటంలో 100 మంది జాతీయవాదులు మరణించినట్లు తెలుస్తున్నది. ఫ్రెంచి సైన్యం విమానాలను ఉపయోగిస్తున్నది. మూడు హెలికాప్టర్లు రెండు విమానాలు దెబ్బతిన్నవి.

## రాష్ట్రం 'కొత్త'ది అని లేకుండా

1 వ పేజీ 8 వ కాలం తరువాయి

హైదరాబాదు నగరం ఆంధ్ర తెలంగాణా రాజధానిగా ఉండాలి.

బీదర్ జిల్లానుంచి విడదీసిన కర్నాటక ప్రాంతాలను అవి మైసూరులో కలిసినప్పుడు ప్రత్యేకజిల్లాగాఏర్పాటు చేయాలి.

### సభాపతి - ఉపసభాపతి

ఆంధ్ర తెలంగాణా రాష్ట్ర శాసనసభ సమావేశానికి, యిప్పటి ఆంధ్ర శాసనసభ సభాపతి అధ్యక్షత వహించినా, కొత్తగా సభాపతిని ఉప సభాపతిని ఎన్నుకొనే అవకాశమేర్పాటు చేయాలి.

(రాష్ట్రాల బిల్లు ప్రకారం హైదరాబాదు శాసనసభ రద్దయిపోవాలి. దానితోపాటు హైదరాబాదు శాసన సభ సభాపతి ఉప సభాపతి గూడా ఆ పదవులనుండి పోవాలి.)

### ఎగువ శాసనసభ

ఆంధ్ర శాసనసభలో ముఖ్య మంత్రి శ్రీ గోపాలరెడ్డి తమ తీర్మానంలో సూచించినట్లు, హైదరాబాదు ముఖ్యమంత్రి గూడా, 75 మంది సభ్యులతో ఎగువ శాసనసభ కావాలని సూచించారు. మహారాష్ట్రానికి కూడా 60 మందితో ఎగువ శాసనసభ యేర్పాటుచేయాలని కూడా, తీర్మానంలో యింకో సవరణ సూచించారు.

### హైకోర్టు

హైదరాబాదు హైకోర్టు అక్టోబరు 1 నుంచే రద్దయిపోయినప్పటికి, ఇప్పుడు హైదరాబాదు హైకోర్టుకు ప్రధాన న్యాయమూర్తిగాను, న్యాయమూర్తులుగాను ఉన్నవారు, గుజరాత్, మైసూరు మహారాష్ట్రాల హైకోర్టులలో ఉద్యోగాలకు దరఖాస్తులు పెట్టుకోనిపక్షంలో — ఆంధ్ర తెలంగాణా హైకోర్టు న్యాయమూర్తులుగా ఉన్నట్లు పరిగణించాలి.

ఇప్పటి హైదరాబాదు హైకోర్టులో న్యాయవాదిగా పనిచేయడానికి అర్హత పొంది ఆ ప్రకారం న్యాయవాదిగా పనిచేస్తున్న ఏ వ్యక్తిఅయినా, ఆంధ్ర తెలంగాణా హైకోర్టులో న్యాయవాదిగా పనిచేసే హక్కు ఉండాలి. అయితే, సంవత్సరంలోగా బొంబాయి, మైసూరు హైకోర్టులలో న్యాయవాదులుగా పనిచేయడానికి ఆ హైకోర్టులకు దరఖాస్తులు పెట్టుకొన్నవారు వెళ్ళిపోవచ్చు. ప్లీడర్ల విషయంలో గూడా యిలాంటి అవకాశమే కల్పించారు. కానీ, యితరరాష్ట్రాల కోర్టులకు దరఖాస్తులు పంపుకొనే గడువు ఆరు నెలలకు పరిమితం చేశారు.

### ఆస్తి అప్పుల విభజన

హైదరాబాదు ప్రభుత్వానికి చెందిన భూములు, తదితర స్థిరచరాస్తులు - యితర రాష్ట్రాలలో ఉన్న వాటిని హైదరాబాదు ప్రాంతాలను విలీనం చేసుకొని, రాష్ట్రప్రభుత్వాలు పరస్పర అంగీకారంతో పంచుకోవాలి. అలాంటి అంగీకారమేమీ కుదరనిపక్షంలో, కేంద్ర ప్రభుత్వ ఉత్తర్వు ననుసరించి పంచుకోవాలి.

హైదరాబాదు ప్రభుత్వం తాలూకు పరిశ్రమలు, వాణిజ్యసంస్థలు అవి ఏ ప్రాంతంలో ఉంటవో, ఆ ప్రాంతాన్ని విలీనం చేసుకొన్న రాష్ట్ర ప్రభుత్వానికి చెందుతవి. వాటికి సంబంధించిన ఆస్తి అప్పుల పూచీ యావత్తు ఆ ప్రభుత్వమే అచ్చుకోవాలి. ఈ రాష్ట్రంలో లేకుండా యితర చోట్ల వున్న పరిశ్రమలుగాని, వాటిల్లో రాష్ట్ర ప్రభుత్వ వాటాలు, లాభాలు వగైరాలుగాని, జనాభా దామాషాను బట్టి, యీ రాష్ట్ర ప్రభుత్వానికి వారసులైన రాష్ట్ర ప్రభుత్వాలు పంచుకోవాలి.

హైదరాబాదు హైకోర్టు సిబ్బందిని పబ్లిక్ సర్వీసు కమిషన్, కార్యాలయ సిబ్బంది శాసనసభ కార్యాలయ సిబ్బందిని, ఆంధ్ర మినహా వారసరాష్ట్ర ప్రభుత్వాలకు చెందిన ఆయా కార్యాలయాలకు కేటాయించాలి.

### మహారాష్ట్రం

మహారాష్ట్ర శాసనసభకు 280 మంది సభ్యులుండాలి. ఉస్మానియా విశ్వవిద్యాలయానికి అనుబంధమై ఉన్న లేదా, యీ విశ్వవిద్యాలయం నడుపుతున్న కళాశాలలు, ఆంధ్ర తెలంగాణా రాష్ట్రం వెలుపల ఉండి ఉన్నా అవి, యీ విశ్వవిద్యాలయానికే అనుబంధమై ఉంటూ ఉండాలి. అలాగే సెకండరీ విద్యామండలి, మరికొన్ని వృత్తికళాశాలలు, యిప్పుడు హైదరాబాదులో ఉన్న కన్నడ మరాఠ్వాడా ప్రాంతాలకు, ముందు ముందుగూడా ఉపయోగపడుతూ ఉంటవి.

### 'ఆంధ్రప్రదేశ్' పేరుకు అంతా అనుకూలురే

రాష్ట్రాల బిల్లుపై యివాళ చర్చ ముగిసింది. క్లాజువారీ చర్చ రేపు ప్రారంభమవుతుంది.

నేటి చర్చలో శ్రీ వి. గోపాలరెడ్డి ఆంధ్రనాయకులు—ఆంధ్ర తెలంగాణా రాష్ట్రాన్ని కొత్త రాష్ట్రంగా పరిగణించాలని కోరుతాను అని చెప్పి మాట తప్పారని విమర్శించారు.

'ఆంధ్రప్రదేశ్' అనదలచిన తెలంగాణా ప్రదేశ్ అంటే బాగుంటుందని ఆయన సూచించారు.

ఆయన ఒక్కడు తప్ప మిగతావారందరూ, 'ఆంధ్ర ప్రదేశ్' అనే పేరే బాగుందన్నారు.

మహారాష్ట్ర సభ్యులు బొంబాయి నగరాన్ని మహారాష్ట్రంలో చేర్చాలని కోరారు.

## సంపాదకునకు లేఖలు

### గుంటూరు పుర ఇంజనీరు

అయ్యా, 6-4-56 వ తేదీ ఆంధ్ర పత్రికలో "పురపాలనలో లోపాలకు ఇంజనీర్ కారణం" అను శీర్షిక క్రింద గుంటూరు పురపాలక సంఘ సమావేశ చర్చను ప్రచురించారు. ఒక సభ్యుడు "పట్టణ అభివృద్ధికి ఆటంకంగా ఇంజనీరు అనేక పనులు చేశాడు" అనే భావం వచ్చు మాటలు అన్నాడు.

అసలు ఈ ఇంజనీరుగురించి చెప్పవలసివచ్చినచో, వీరు పూర్వమొకప్పుడు ఇచ్చట ఇంజనీరుగా వున్నపుడు వారు మూడవ గ్రేడుకు సంబంధించిన వారను కారణమున పురపాలక సంఘం, వారిని బదిలీ చేయాలని కోరగా, వారి కిప్పుడు మొదటి గ్రేడునిచ్చి గుంటూరుకు పంపియున్నారు. అందుచేత వారి శక్తిసామర్థ్యములను గురించి ప్రభుత్వమున కెట్టి అభిప్రాయముగలదో తెలియగలదు. వారి చర్యలనుగురించిన వ్యతిరేక ప్రచారమును పరిశీలించవలసి వచ్చినచో, గుంటూరు రాజకీయము అన్నిటిని పరిశీలించవలసి యుండును. ప్రత్యేకమైన అభిమానముతో కొన్ని వార్డులలో అభివృద్ధికరమైన పనులు అధికముగా ఈ ఇంజనీరు చేయించినారను ఆరోపణయే ఎక్కువ ప్రచారములో గలదు. ఇది చాల పత్యదూరమని లెక్కలనుబట్టి గట్టిగా చెప్పగలము. గత రెండు మూడు సంవత్సరములలో నిర్లక్ష్యము చేయబడిన వార్డులలో కొంతపని అధికముగా జరుగుటయు, గత ఇంజనీరు కాలములో జరుగుతుండాయుయిన పనులు ఇప్పుడు నిర్వహించవలసి వచ్చుటవలన కొన్ని వ్యత్యాసములు కనబడవచ్చును. కాని గత 3, 4 సంవత్సరముల లెక్కలను పూర్తిగా పరిశీలించినయెడల, జనాభానుబట్టియు, ప్రాముఖ్యాన్ని బట్టియు అన్ని వార్డులకు సక్రమమైన ఆదరణ, న్యాయము కలుగుచున్నదని చెప్పగలము. కాని, రాజకీయపార్టీలనుబట్టి అభిప్రాయము లను ఉటంకించుగా మార్చుకొను స్వభావముగల వారి సంగతి వేరుగా చెప్పనవసరము లేదు.

'శ్రీ తూనుకుంట్ల వెంకటప్పయ్య అధ్యక్షులుగా వుండగా, తమ వార్డులలో యెంతో ఉపయుక్తమైన, అభివృద్ధికరమైన పనులు జరిగినవని నోటిమాటల ద్వారానే గాక, పత్రికాముఖాన కూడ తమ అభిప్రాయములను వెల్లడించిన సభ్యులుకూడ కొంతమంది శ్రీ వెంకటప్పయ్యపై తేబడిన అవిశ్వాస రాహిత్య తీర్మానమునకు అనుకూలంగా ఓటు చేయుటలోని అంతర్యమును 'సరిగా అర్థంచేసికోగలిగితే, ఇంజనీరుపై జరుగుచున్న అక్రమ ప్రచార నిజస్వరూపము, తత్కారణములు కూడ సుబోధకం కాగలవనుట నిస్సందేహము.

కుమారస్వామి, రాచపూడి వెంకట సుబ్బారావు, కడకొయ్యల అంకమ్మ, నాజర్ అహమద్. (పురపాలక సంఘ సభ్యులు)

* * *

### పవరుపేట స్టేషన్లో ఎండ బాధ

అయ్యా,

ఏలూరుపట్టణానికి రెండు రైల్వే స్టేషను లున్నాయి. ఒకటి ఏలూరు, రెండవది పవర్ పేటస్టేషను. పవరుపేట స్టేషను పట్టణ మధ్యభాగంలో వున్నందున పశ్చిమ గోదావరిజిల్లా ముఖ్య పట్టణమైన ఏలూరుకు వచ్చిపోయే వేలకొలది ప్రయాణీకులు పవరుపేట స్టేషనులోనే ఎక్కుతూ దిగుతూ వుంటారు. అందుచేతనే కాబోలు జాతీయ ప్రభుత్వం ఈ స్టేషన్‌ను ఇంకా పెద్దదిగ, ఆధునిక సదుపాయములతో అభివృద్ధి చేస్తూ క్రొత్తగ నిర్మాణం చేస్తున్నది. ఇందుకు ప్రభుత్వానికి ఏలూరుపట్టణ పౌరులందరు కృతజ్ఞులు.

అయితే, తాత్కాలికంగా కావచ్చు గత కొన్ని మాసములుగ ఈ స్టేషన్‌ను నిర్మాణంలో వున్నందున ప్రజల కవసరమైన సదుపాయములు లేకుండాపోయినవి. కనీసం నిలువ నీడైనా లేకుండా ఉన్నది. అందులోను యిది వడి వేసవి కాలం. మండు టెండలు. వడగాలి ఎక్కువగ వున్నందున ప్రయాణీకులు నానా అవస్థలకు గురియగుచున్నారు. ముఖ్యంగా చంటి బిడ్డలు—తల్లులు పడేబాధ చూడగ చాల విచారముగ నున్నది. కట్టడాలు కనీసం యింకా రెండుమూడు నెలలవరకైనా పూర్తి అయ్యేట్లు లేవు. ఈ రెండు మూడు నెలలే ఎండలు, వడగాల్పులు అత్యధికం. కనుక రైల్వే అధికారులు 'తాత్కాలికమే' అనే దృష్టితో ఏమీ చేయకుండా ఉపేక్షించుట న్యాయం కాదు. అలా నిర్లక్ష్యం చేయడం తగనుకూడా. గనుక పవరుపేట స్టేషను బుక్కింగ్ ఆఫీసువద్ద, ప్లాటుఫారం మీద తాటాకుపందిళ్లు తాత్కాలికంగ వేయించాలి. మంచినీటి సదుపాయం చేయించవలసినదిగా అధికారులను ఆర్థిస్తూ—యిందుకు తగిన అవసర చర్యలు తక్షణం తీసుకోవలసినదని కోరుచున్నాను.

మాకే వెంకటనారాయణ.

---

బాపట్ల, ఏప్రిల్ 8: కారుమూరు పంచాయతీ సంఘానికి 7 గురు సభ్యులు ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. వా, సభ్యులు: శ్రీ గాదె.. మిక్కిలి పెరయ్యారెడ్డి, కందుల .. ,కొండెపు ఉందయ్య, వట్టిగొర్ల కనకయ్య, కొమరాను వెంకటస్వామి, శ్రీరాము రామకోటయ్య, మున్నాడ బాజర్.

# బుడమేరు రిజర్వాయిర్‌ను వదిలివేసి, మళ్లింపు కాలవకు శంకుస్థాపన

## బుడమేటి ముంపు— ఇంజనీర్ల లెక్కలు

| | |
|---|---|
| విజయవాడతాలూకా మెట్ట ప్రాంతాలు | 5 వేల ఎకరాలు |
| గన్నవరం గుడివాడతాలూకాల పల్లపుప్రాంతాలు | 17 ,, |
| కొల్లేరు సరస్సు సమీపప్రాంతాలు | 23 ,, |
| ఇతర కొల్లేటివాగుల పరిసరాలలో | 5 ,, |

బుడమేరుమూలంగామునిగే మొత్తం ప్రాంతం 50 వేల ఎకరాలు

## పరాపరి నష్టాలు

| | |
|---|---|
| సాగుభూములు 50 వేల ఎకరాలకు | రూ. 6801 వేలు |
| 52 గ్రామాలకు | — |
| 400 ఇళ్ళకు | రూ. 130 వేలు |
| 540 పశువుల నష్టం | రూ. 90 వేలు |
| రోడ్లకు కాలవలకు కలిగే నష్టాలు | రూ. 20 వేలు |
| శిస్తుమాఫీ | రూ. 20 వేలు |
| సాలుసరి నష్టం | రూ. 7061 వేలు |

బుడమేరు రిజర్వాయిర్‌ను వదిలివేసి, ఆంధ్రప్రభుత్వం, కొలూరు దగ్గర ఒక మళ్లింపు కాలవకు ఏప్రిల్ 11 న శంకుస్థాపన చేయిస్తున్నది. వరదనివారణ పథకాన్ని, మళ్లింపు కాలవ ఏర్పాటుతో సరిపెట్టటం జరగవచ్చునని తెలుస్తున్నది. ఈ సందర్భంలో లభించిన వివరాలను ప్రకటిస్తున్నాము.

కొల్లేరుసరస్సులో పడే ఏరువాగుల్లోకల్లా బుడమేరు, పెద్దది. తక్కిన నాలుగు ఏరులు ఇవి (1) తమ్మిలేరు (2) రామిలేరు (3) బుడమేరు (4) యర్రకాల్వ. ఇందులో కొల్లేరు తిరువూరు తాలూకా రేపూడి గ్రామం దగ్గరపుట్టి కృష్ణాజిల్లాలో తిరువూరు తాలూకా, విజయవాడ తాలూకా, గన్నవరం, గుడివాడ తాలూకాల మీదుగా పోయి కొల్లేరులో పడుతుంది దీని నిడివి మొత్తం 80 మైళ్లు. ఈ 80 మైళ్ళ నిడివిని ప్రవహించి కైకలూరు తాలూకా ఇంపర్రు గ్రామంవద్ద కొల్లేరులో పడుతుంది. ఇది ప్రవహించే తాలూకాలలో 516 చ॥ మైళ్ళ మెట్టనేల, 232 చ॥ మైళ్లు డెల్టానేల మొత్తం 748 చ॥ మైళ్ళ నేలలో దీని ప్రాభవం చెల్లుతోంది. విజయవాడదగ్గర మద్రాసు హౌరా రైలుమార్గాన్ని ఎనికేపాడు కేసరపల్లి సివార్ల ఏలూరుకాల్వను ఇది దాటుతుంది. ఇది పోయేందుకు ఈ ప్రూళ్ళ దగ్గర 7/3, 10/3 మైలురాళ్లవద్ద అక్విడక్టులు కట్టారు.

సాలీనా ఏటిలో 81330 క్యూసెక్కుల వరదనీరు ప్రవహిస్తుంది అయితే ఇంతనీరును భరించే తాహతు దీనికి లేదు. ఇందులో 1/4 వంతు నీటిని మాత్రం భరించ గలుగుతుంది. అందువల్ల ఆ 1/4 వంతు నీరు పోను తక్కిన నీటి వలన ముంపులు ఏర్పడుతున్నాయి. ఏటికి ఇటూ, అటూ రెండుమైళ్ళమేర పొడుగునా పల్లపు నేలలను అన్నింటిని ఈ ముంపు ముంచి వేస్తుంది. ఇది మెట్ట నేలల సంగతి. డెల్టా ప్రాంతంలో ఇటూ, అటూ ఎటుచూచినా మూడు మైళ్ళ మేర, పొడుగునా ముంపు కల్పిస్తు కొల్లేరులో జలార్ణవంగా మారి పోతుంది. ఈ ఏటి ముంపువల్ల ఇంకో ప్రమాదంకూడా జరుగుతూవుంటుంది. దీనికి ముంపు వచ్చినప్పుడల్లా, కొల్లేటికికూడా ముంపు వస్తుంది. దానితో ఆ చుట్టుపట్లవున్న డెల్టా భూములన్నీ మునిగి పోతాయి. ఇట్లా మునిగిపోయే నేలల ఆరా ఈ క్రింద ఇస్తున్నాము. ఇక ఈ ముంపువల్ల ఎట్లా లేదన్నా ప్రతిసాలూ 40% దాకా పంట నాశనమై పోతూ వుంటుంది.

రోజువారీగా అయితే బుడమేటిలో మామూలుగా 300 క్యూసెక్కులకన్నా ఎక్కువ నీరు ప్రవహించదు ఆగస్టు, సెప్టెంబరు నెలల్లో బ్రహ్మాండంగా వరదలు వస్తాయి అప్పుడు పొలాలు పంటల మీద వుండటంవల్ల, ఈ బుడమేటి ముంపు వాటికి తెచ్చే నాశనం ఇంతా అంతా కాదు. జరిగిన 5 ఏండ్లలోను ఈ ముంపులవల్ల పంటలకు, జనానికి, పశువులకు, ఇళ్ళకు జరిగిన నష్టం యొక్క స్వరూపం ఏమిటో ఈ క్రింద పొందుపరిచిన అంశాలను బట్టి తెలుస్తుంది. ఈ ఏరు ఇంతటి కష్టనష్టాలకు కారణం అవుతున్నది గనుక జరిగిన 25 సంవత్సరాల నుంచీ ఈ వరద బాధను తొలగ చెట్టడానికిగాను ఏవో ప్రణాళికలు వేస్తూనే వున్నారు. ఏవో ఆలోచనలు చేస్తూనే వున్నారు.

ఆంధ్ర ప్రభుత్వం ఈ అన్ని ప్రణాళికలను పరిశీలించి, వాటిని భారత ప్రభుత్వంవారికిఅందజేస్తూ, ఈఏరులో వరదలను నివారించడానికి ఈ క్రింద ప్రణాళికలను వరద అదుపు కార్యక్రమం చేర్చవలసిందిగా సూచించింది (1) ఈ ఏటిమీద ఒక రిజర్వాయరు కట్టాలి. (2) వరదనీటిని కృష్ణానదిలోకి మళ్ళించేందుకుగాను ఒక రెగ్యులేటరును కట్టాలి. (3) మళ్ళింపు కాలవను లంపాడు దగ్గరనుంచి, కొల్లేటిదాకా ఈ ఏటికి కరకట్టలు పొయ్యాలి. బుడమేటిలోని నీటిని కృష్ణలోకి మళ్లించడానికి ఒక కాల్వను విజయవాడ తాలూకాలో వెలగలూరు గ్రామందగ్గర నుంచి త్రవ్వాలనికూడా ఆలోచనలు చేశారు. ఇదిచేస్తే బుడమేటి ముంపు నీరు చాలాభాగం కృష్ణలోకి వెళ్లిపోతుంది. ఈ కాల్వను త్రవ్వగా ప్రారంభం చెయ్యవలసిచోట మొత్తం 906 కోట్ల 10 లక్షల ఘనపు 11 అడుగులనీరు నిలుస్తుంది. ఇప్పుడు ఈ నీటిని కాల్వ ద్వారా కృష్ణలోకి మళ్ళిస్తే సాలీనా 746 కోట్ల ఘనపు అడుగులనీరు ఆ నదిలోకి ప్రవహించి పోతుంది. అప్పుడు బుడమేటిలో సాలీనా 160 కోట్ల 10 లక్షల ఘ॥ అడుగుల నీరు మాత్రం ప్రవహించేవిధంగా పని జరుగుతుంది

ఈ డైవర్షన్ కాల్వను బందరు-హైదరాబాదు రోడ్డుమీద 61/3 మైలు రాయివద్ద, కృష్ణానది ఎడమగట్టు 7/8 మైలురాయి వున్నచోటున కృష్ణలో కలపాలని ఆలోచనవుంది. ఇక్కడికి తెచ్చి దీన్ని కృష్ణలో పడెయ్యాలంటే వెలగలూరునుంచి 6 మైళ్ళ 4 ఫర్లాంగుల నిడివిని ఈకాల్వను త్రవ్వాలి. ఇక్కడి నుంచి ఇది జగమేంద్ర మురికికోడులో కలిసి ప్రవహిస్తుంది. అందువల్ల ఈ మురుకుకోడును డైవర్షన్ కాల్వగా రూపుపొందించాలన్న ఆలోచనలు వున్నాయి.

బుడమేటిమీద కట్టే రెగ్యులేటరుకు 16 తూములు వుండాలని ఆలోచించారు. ఒక్కొక్కటూము 20' × 9' సైజులో వుండాలి. దీన్ని డైవర్షన్ కాల్వను ప్రారంభించేచోట కట్టాలి. దీన్ని కట్టిన అనంతరం దీని క్రింద కొంత ఆయకటును పెంచి, ఆయకట్టు దార్లకు సంరక్షణను చేకూరుస్తారు. ఇక ఇక్కడినుంచి బయలుదేరే డైవర్షను కాలువ మొత్తం 7 మైళ్ళ 3 ఫర్లాంగుల 380 అడుగులు వుంటుంది. ఈకాల్వక్రింద సాగు సౌకర్యాలు వుండవు.

ఈ కాల్వ అనేకమైన మురుకోళ్లను, ఖల్లిగాల్లను, గ్రామంరోడ్లను దాటిపోవలసివుంటుంది. గనుక,అందుకు వంతెనలు, మొదలైనపనులను జరిపించవలసినఏర్పాట్లుగూడా ఈప్రణాళికల్లో వున్నాయి అయితే దారిలో తగిలే పిల్లకాల్వలను, మురుకోళ్లను ఇందులో కలపరు. అవి చాలాభాగం చెరువులను నింపుకుని ... దాటవలసి వున్నదో అక్కడ వంతెన, తిలుపుల తూము కట్టాలి. ఇట్లా చేయటంవల్ల కృష్ణకు వరదలు వచ్చినప్పుడు, ఆ నీరు ఈ కాల్వలోకి ఎక్కుతుందనే భయం వుండదు. ఇక వంతెన తూము తిలుపులను వాటి అంతట ఆవేపడి, తెరచేటట్టు ఏర్పాటు చేస్తారు.

రెగ్యులేటరును బుడమేటిని కలుపుతూ, ఏటి ఎడమగట్టున ఒకమైలు ఆరు ఫర్లాంగుల పొడుగున కరకట్ట గూడా పొయ్యవలసివుంది. వరదను అరికట్టేందుకు దీన్ని పోస్తారు. ఇందువల్ల ప్రస్తుతం వున్న పల్లపుభూమి ఏటినుంచి వేరైపోతుంది ఈ వరదలు వచ్చినప్పుడు ఈ కరకట్టపైన చేరి నిల్వవుండే నీటిని తోడెయ్యడానికి, ఈ కరకట్టలో తూములు ఏర్పాటు చేస్తారు.

నీటిని ఈ విధంగా మళ్ళించడం కోసం పెట్టుకున్న కార్యక్రమం అంతా పూర్తి అయినతర్వాత ఏమి జరుగుతుందో జాగ్రత్తగాపరిశీలిస్తారు. అప్పుడు బుడమేరుమీద రిజర్వాయరు కట్టాలా, వద్దా, ఆలోచనచేస్తారు.

ఈ ప్రణాళికవల్ల కల్గే లాభాలు ఈ విధంగా వుంటాయి (1) ఏటికి దిగువలో వరదకయొక్క ఉధృతం వుండదు. పైగా ముంపువల్ల పంటలకు జరుగుతున్న నష్టం చాలాభాగం తగ్గిపోతుంది (2) బుడమేటి వరదనీటిని కృష్ణలోకి మళ్లించడంవల్ల కొల్లేటి ముంపుగూడా తగ్గిపోతుంది. ఏటా కొల్లేరులోపడే ఈ ఏటి నీటిలో 746 కోట్ల ఘ॥ అడుగులు తగ్గిపోతుంది. అందువల్ల ఈ సరస్సులోని నీటిమట్టం 1.1 అడుగు తగ్గుతుంది ఇంత తగ్గితే ఆ చుట్టుప్రక్కల 23 వేల ఎకరాలకు కొల్లేటి ముంపుబాధ తొలగిపోతుంది. (3) ఏటిలో వరదనీటిని తొలగిచెడుతూ వున్నందువల్ల బుడమేరు హద్దుల్లో 22 వేల ఎకరాలకు ఏటి ముంపువల్ల వచ్చేబాధ రద్దవుతుంది. (4) కొల్లేరుకు బుడమేటి నీటిబరువు తగ్గుతున్నందువల్ల, ఇతరమైన ఏరుల నీటిని అధికంగా భరించే శక్తికల్గి, ఆ ఏరులకు వచ్చే వరదలు తగ్గిపోతాయి. ఇందువల్ల 5 వేల ఎకరాలకు ముంపుబాధ తప్పుతుంది. ఈ ప్రణాళికవల్ల కల్గే పరోక్షమైన లాభాలలో ఇది ఒకటి.

### ప్రణాళికలకు సంబంధించినకొన్ని ముఖ్యాంశాలు

(1) నీటిమళ్ళింపు ప్రదేశం దగ్గర బుడమేటి నీటితీరువ వైశాల్యం-260 చ॥ మైళ్లు.

(2) పదిలో ప్రవహించే నీటియొక్క గరిష్ఠ ప్రమాణం—24450 క్యూసెక్కులు.

(3) రెగ్యులేటర్ వద్ద వరదయొక్క గరిష్ట మట్టం—ప్లస్ 86.00

(4) రెగ్యులేటరు దిమ్మ మట్టం—ప్లస్ 77 00

(5) రెగ్యులేటరు పొడుగు—387'-6''

(6) రెగ్యులేటరు తిలుపుల కొలతలు—

(1) పొడుగు — 20'

(2) ఎత్తు — 9'

(3) మొత్తం — 16

(7) మళ్లింపుకాల్వ పొడుగు—7 మై. 3 ఫ. 380 అ. లు.

(8) కాల్వగర్భం వెడల్పు—210 అడుగులు.

(9) సగటున కాల్వలో కు— అడుగులు.

(10) కాల్వ పక్కవాలులు 1.1

(11) గట్టుఅంచుల వెడల్పు—15 అడుగులు.

(12) కాల్వగట్టుల వాలులు—$1\frac{1}{2}$ 1

(13) కాల్వ అంచులకు, గట్లకు మధ్యవుండే ఖాళీస్థలం—46.6 అ.

(14) కాల్వగర్భం వాలు—1 27'/ మైలు.

(15) కాల్వవేగం - సెకండుకు 38 అడుగులు.

(16) కనిష్ఠ ప్రవాహం—7600 క్యూసెక్కులు.

(17) కాల్వ నదిలో పడేచోట కట్టే వంతెనలో ఏర్పాటయ్యేఖానాలు—50 ఏసి అడుగుల చొప్పున 4.

(18) ఈ వంతెనకు పెట్టేతూములు—20.

(19) తూము సైజు 8' × 9''

(20) వంతెనమీద రోడ్డు వెడల్పు-22 అడుగులు

(21) వంతెనకు ఇంగ్లీషు అక్షరం "టి" వమూనాలా వుండే అడ్డదూలాల మీద కడతారు.

(22) ఖర్చు — 33 లక్షల 39 వందలు.

(23) పరోక్షం అపరోక్షం ఖర్చులతో సహా 37 లక్షల 20 వేల రూపాయలు.

### బుడమేరు కరకట్టల నిర్మాణాదికాలు

బుడమేటి వరద ఘటనల్ని నష్టం కొంత తగ్గించడానికి విజయవాడ తాలూకా ముస్త్యాలంపాడు గ్రామం దగ్గరనుంచి కొల్లేరులో అది పడేటంత దూరమూ కరకట్టలు పొయ్యాలనిగూడ ఒక పథకం వుంది. బుడమేరు అంచులను ఆనుకొని పొడుగునావున్న భూములన్నీ పల్లపుభూము లవటంచేత, దీని నీటిని కృష్ణలోకి మళ్ళించిన అనంతరంగూడా ఇట్టి 15 వేల ఎకరాలకు వరద వచ్చినప్పుడు ముంపు భయం తప్పదనిపిస్తున్నందువల్ల యీ కరకట్ట పొయ్యవలసిన అవసరం ఏర్పడుతున్నది. ఇట్టి ఈ కట్టలను 58 మైళ్ల నిడివిని పొయ్యాలి. మెట్టనేల ప్రాంతంలో 20 మైళ్ళ పొడుగునా, డెల్టా ప్రాంతంలో 38 మైళ్ళ పొడుగునా పొయ్యాలి. ఈకరకట్టలను గూర్చిన ఆలోచనలు చేసేటప్పుడు ఈ అంశాలను దృష్టిలో వుంచుకున్నారు. (1) ఏటి అంచుకు, కట్టలోపలి అడుగు మధ్య 150 అడుగుల ఖాళీ స్థలాన్నీ పొడుగునా వదలాలి. (2) కట్టపై వెడల్పు 10 అడుగులు వుంటుంది. (3) ఎత్తు ఎంతవుండాలి అన్నది మళ్ళింపు పని పూర్తి అయిన తర్వాత వరద ప్రాంతం పారుదలనుబట్టి నిర్ణయించడం జరుగుతుంది.

ఇక ప్రణాళిక అమలు పరచడానికి 846 ఎకరాల భూమిని ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలి. మరి ఈ నేలలన్నీ మంచి ఖరీదుగల నేలలు. అందువలన పరిహారం బాగా చెల్లించవలసి వుంటుంది. పోతే ఈ త్రవ్వే మళ్ళింపు కాల్వ తిరపాయేదారిలో తాకే వాగులకు మురుకోడులకు తూములు అవసరమైతే ఏర్పాట్లుగూడా ఇందులో వున్నాయి.

జల సంబంధి వివరములు: (1)వరదకట్టల ప్రారంభస్థలం వద్ద ఏటియొక్క వరద ప్రాంతం-26-చ॥ మైళ్లు (2)వరద కట్టలచివరిలో ఏటియొక్క వరద ప్రాంతం (1) మెట్ట ప్రాంతంలో 516 చ॥ మైళ్లు

(2) డెల్టా ప్రాంతంలో 286 చ॥ మైళ్లు

మొత్తం... 748 చ॥ మైళ్లు.

(3) మళ్లింపు పనులు పూర్తిఅయిన అనంతరం వరద కట్ట మొదలు అయిన చోట వరద పారుదల యొక్క గరిష్ఠ ప్రమాణం-16950 క్యూసెక్కులు.

(4) వరద కట్టుల కొనలలో ఈ మళ్ళింపు పనులు పూర్తి అయిన అనంతరం వుండే వరదనీటి పారుదల యొక్క గరిష్ఠ ప్రమాణం.

(5) వరద గట్టుల మొదళ్లలో ఏటికి గట్టుకు మధ్యవదల వలసిన స్థలం నిమిత్తం ఏటినుండి గ్రహించవలసినభాగం-100 అడుగులు.

(6) కట్టకుదల్లో కావలసిన భాగం-145 అడుగులు.

(7) కరకట్ట మొత్తం ఎత్తు- 12 అడుగులు.

(8) గట్టువాలు-$1\frac{1}{2}$: అడుగులు.

(9) గట్టుపై వెడల్పు-10 అడుగులు.

(10) నది నీటిలోతు (గరిష్టం) 20 అడుగులు.

(11) ఖాళీ-4 అడుగులు.

గడిచిన 10 ఏండ్లలోను కొల్లేటి నీటి గరిష్ఠ మట్టం 6 8 గా వుంటున్నది ఇప్పుడు ఈ పనిఅంతా జరిగితే ఇది 6.8-1 1-5 7 గా నిర్ధిష్టంది. ఇందువల్ల కొల్లేరు తీరంలో ప్లస్ 5 వరిపాస్నతి లేల దాకా డెల్టా వ్యవసాయం పెరుగుతుంది. అంటే ప్రస్తుతం కొల్లేటి ముంపుకు లోనవుతున్న అన్ని భూములకు ఈమళ్ళింపు పథకాలు అమలు జరిగితే ఆ ముంపు బాధ తప్పిపోతుంది.

### అమెరికాకు స్పెయిన్ విదేశాంగ మంత్రి రాక

వాషింగ్టన్, ఏప్రిల్ 10 స్పెయిన్ విదేశాంగమంత్రి శ్రీ మార్టిన్ ఆర్టాజో అమెరికా ప్రభుత్వ ఆహ్వానం మీద నిన్న ఇక్కడికి వచ్చారు.




# నాగార్జున సాగరం వద్ద శ్రమదానావసరం

## ఇంజనీర్ల ఆలోచన: జరుగుతున్న పని వివరణ

## ఈ యేడు ఇంకా రు. 2 కోట్లు ఖర్చు చేసే అవకాశం

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

కర్నూలు, ఏప్రిల్ 10: నాగార్జున సాగర నిర్మాణంలో కొంత ముఖ్యమైన పనికి మనుష్యులనే నియమించాలా లేక యంత్రాలను వినియోగించాలా శ్రమదానం ఎలా స్వీకరించాలి అనేవిషయాన్ని ఇంజనీర్లు ఆలోచిస్తున్నారనీ, ఈ సంవత్సరం కేంద్రప్రభుత్వం కేటాయించిన రూ. 3 కోట్లు కాక, ఇంకా రూ. 2 కోట్లు ఆగస్టునెల ప్రాంతంలో అదనంగా కేటాయించవచ్చుననీ నాగార్జున సాగర నిర్వాహకులు శ్రీ యస్. చక్రవర్తి తెలియచేశారు.

నాగార్జున సాగర నిర్వాహక సంస్థ నిన్న మధ్యాహ్నం ఇక్కడ సమావేశమై ప్రస్తుతం జరుగుతున్న పనినీ, ఇప్పుడు జరగవలసిన పనినీ సమీక్షచేశారు.

సమావేశంఅనవింతరం నిర్వాహకులు శ్రీ యస్. చక్రవర్తి పత్రికా ప్రతినిధులతో ప్రసంగిస్తూ, శ్రమదానం ద్వారా ప్రజల సహకారం సేకరించే విషయం కూడా నిన్న సంస్థ పరిశీలించిదని చెప్పారు.

నిర్మాణానికి మనుష్యులను నియమించాలో,యంత్రాలనే వినియోగించాలో నిర్ణయించవలసింది కేంద్ర ప్రభుత్వం అని చెప్పారు. సకలార్థ సాధనకార్యక్రమాల నిర్వహణలో చీనాలో మాదిరిగా మనుష్యులను నియమించే పద్ధతిని కేంద్ర ప్రభుత్వం ఆలోచిస్తుంది.

### శ్రమదానంవల్ల తక్కువ టెండర్లు

కోసీ ప్రాజెక్టులో భారత సేవక సమాజ సేవకుల శ్రమదానం వలన టెండర్ రేట్లు తగ్గాయట. అసేవకులకూ లభించింది సమాజం 10% తీసుకుంటుంది. ఖర్చులకి $2\frac{1}{2}$% సమాజ కార్యక్రమాలకి మిగతా $7\frac{1}{2}$% వుంచుకొంటుంది.

ప్రజల కృషికి ఎంతపని వదలాలనే విషయాన్ని హైదరాబాదులో మే 9వ తేదీని నిర్వాహకసంస్థ సమావేశమైనప్పుడు నిర్ణయిస్తుంది.

### సాగరం- మాచెర్ల బాట నిర్మాణం

### బుద్ధ జయంతి యాత్రికుల సౌకర్యార్థం

వచ్చేనెల బుద్ధజయంతి సందర్భంలో అనేకమంది యాత్రికులు రానున్నారు కనుక మాచెర్ల - నాగార్జున సాగరం ప్రాజెక్టు రోడ్డును ఆంధ్ర ప్రభుత్వం బాగు చేయిస్తున్నారు. నాగార్జున సాగరం ప్రాజెక్టు నిర్మాణ స్థలంవద్ద బుద్ధుని అవశేషాలను చూచేందుకు బౌద్ధయాత్రికులు అనేకమంది వస్తారు.

ఈ రోడ్డు పొడవు 15 మైళ్ళు. కిందటి జూలైలో వేయించారు. అయితే ఇప్పటికే చాలా పాడైపోయింది ఇప్పుడు నాగార్జున సాగరం ప్రాజెక్టు నిర్మించుతున్న చోట మహాచైత్యవుండేదట. అక్కడ బుద్ధుని అవశేషాలలో కొన్ని దొరికినవి. సర్నాథ్ లోని మూలగంగ కుటి విహారానికి ఆ అవశేషాలను తీసుకునిపోయి ఆరాధన జరుపుతున్నారిప్పుడు..

నాగార్జునసాగరం ప్రాజెక్టు సమీపంలో వస్తుప్రదర్శన కేంద్రమొకటి నిర్మించే ఆలోచన ఉన్నది. వస్తుప్రదర్శన కేంద్రనిర్మాణం జరిగితే ఆ అవశేషాలను మళ్లీ అక్కడికి తీసుకవచ్చే అవకాశం ఉన్నది.

ప్రాజెక్టువద్ద రూపొందనున్న విజయపురీ పట్టణం మళ్ళీ బౌద్ధ క్షేత్రంగా విలసిల్లవచ్చు.

వస్తుప్రదర్శన కేంద్రం నమూనా నిర్ణయించేందుకు భారత ప్రభుత్వం నియమించిన సంఘం ఈ నెల 18 వ తేదీన నాగార్జునసాగరం ప్రాజెక్టుస్థలం వద్ద సమావేశమవుతుంది.

బౌద్ధులనాటి అవశేషాలన్నింటిని పైకి తీయించాలంటే ప్రాజెక్టు సమీపంలో మొత్తం 1750 ఎకరాలభూమిని త్రవ్వించవలసి ఉంటుంది. ఇప్పటికి వంద ఎకరాలలో త్రవ్వకంపని అయింది.

# ఉత్తరాఫ్రికాతో సైనిక కూటం

## అమెరికా యత్నాలు

పారిస్, ఏప్రిల్ 10: ఫ్రాన్సు, స్పెయిన్, ఇటలీ, మొరాకో, ట్యునీసియాలను చేర్చి మరో కొత్త సైనిక కూటాన్ని - మధ్యధరా సైనికకూటం- స్థాపించడానికి ఫ్రాన్సులోని అమెరికా రాయబారి శ్రీ డిలన్ మొరాకో సుల్తాన్, జనరల్ ఫ్రాంకోతో రాయబారాలు జరిపారనీ, ప్రస్తుతం ఇటలీతో రాయబారాలు సాగిస్తున్నారనీ ఇక్కడికి వార్తలు వస్తున్నాయి.

స్పానిష్ విదేశమంత్రి వాషింగ్టన్ వెడుతూ, ఈ కూటంపట్ల తమ ప్రభుత్వం సుముఖంగా ఉన్నట్లు సూచన చేశారు.

దీనితో స్పెయిన్, మొరాకో, ట్యునీసియాలను ఉత్తర అట్లాంటిక్ కూటంతో ముడి పెట్టినట్టవుతుంది.

## ఇజ్రేల్ సన్నాహాలు

లండన్, ఏప్రిల్ 10. ఈజిప్టు సరిహద్దుల్లో ఇజ్రేల్ రక్షణలను బలపరిచేందుకు స్వచ్ఛందసైనికులు లారీలలో వెడుతున్నారని ఇజ్రేల్ అధికారి ఒకరు నేడు జెరూసలేంలో వెల్లడించారు. నిన్న రాత్రినుంచీ ఈజిప్టు కమాండో సైనికుల దాడులు తిరిగిపోయి నవని ఆయన అన్నారు.

## మరికొన్ని నీటి వనర్లు

### డా॥ కె. ఎల్. రావు చర్చ

కర్నూలు, ఏప్రిల్ 9: నాగార్జున సాగరం కంట్రోల్ బోర్డు సమావేశానికి గాను నిన్న ఇక్కడికి వచ్చిన కేంద్ర జలవిద్యుచ్ఛక్తి మండలి సభ్యుడు డా॥ కె.ఎల్. రావు ఆంధ్ర నీటి పారుదలశాఖ స్పెషల్ చీఫ్ ఇంజనీరులో ఆంధ్రలో మరికొన్ని నీటి పారుదల పథకాలను గురించి చర్చించినట్టు తెలిసింది.

బుడమేరు

ముంపు ప్రదేశము

ఆంధ్ర ప్రభుత్వం వ్యవసాయ శాఖవారిచే
ప్రవేశపెట్టబడిన
ఫిల్టర్ పాయింట్ స్కీం క్రిందను
వాయిదాలలో సొమ్ముచెల్లించే స్కీం
క్రిందను పేరొందిన
కూపర్ డీసెల్
ఇంజన్లు
మార్షల్ పంపు సెట్లు
కొనడానికి త్వరపడండి.
మార్షల్ సన్స్ & కంపెనీ (ఇండియా) లిమిటెడ్
8, సెకండ్ లైన్ బీచ్, మద్రాసు-1.

హైద్రాబాదు, బెజవాడ, గుంటూరు, మద్రాసు. విలువ వనుసరించి రాశి।

కవిరాజ్ పండిత మున్షాదత్ శర్మ, వైద్య వాచస్పతి ప్రపంచ ప్రఖ్యాతి "నవరత్నకల్ప" కని పెట్టినవారు ఇండియాలోని ముఖ్య నగరాలకు ప్రతినెలవిచ్చేసెదరు

* హైద్రాబాదు *
ప్రతినెల 10, సా॥ 4 నుండి రా 7-30 వరకు 11 (ఉదయం, సాయంత్రం) లాబీనువూరి హోటలి, కింగ్ కోఠీరోడ్ ఫోన్: 5681.

* విజయవాడ-2 *
ప్రతినెల 12 తేదీ, పెరిఖంపాటలి సుబ్బరి బిల్డింగ్ గాంధినగర్. ఫోన్ 286

* గుంటూరు *
ప్రతినెల 13-వ తేదీ, ఒడిపి శ్రీ కృష్ణ భవన్, స్టేషన్ రోడ్డు ఫోన్. 181

* మదరాసు *
ప్రతినెల 14, 15 అంబాసిడర్ హోటలి 151 మౌంట్ రోడ్, ఫోన్: 86823

సంప్రదింపు వేళలు. ఉ॥ 7-30 నుండి మ॥ 12-30 వరకు సా॥ 4-0 నుండి రాత్రి 7-30 వరకు. విలువైన సలహా పొందుదు వేళలు తప్పకుండుటకు విమానంలో వెళ్లుదురు "నవరత్న కల్ప" వాడండి.

వజ్రాలు మాణిక్యాలు, ముత్యాలు పగడాలు పచ్చలు, గోమేధికములు, నీలమణులవగైరా తొమ్మిది విలువగలరాళ్లు కలసినది

నరముల బలహీనత, అజీర్ణవ్యాధులు, బోదకాలు, భగందరము, బొల్లి, నాడీ వ్రణము, మూలవ్యాధి, ఉబ్బసం, రక్తదోషం దీర్ఘవ్యాధులు, నూత్నవ్యాధులు పోగొట్టి పూర్ణారోగ్యం ఇచ్చుటలో సాటిలేనిది.

బెంగుళూరు, మైసూరు, కోయంబత్తూరు, సేలం, తిరుచినాపల్లి, తంజావూరు, మధుర, తిరునల్వేలి, తిరువేంద్రం, కొట్టాయం, ఎర్నాకులం, పాండిచ్చేరి క్యాంపుల అడ్రసులకు ఉచిత లిటరేచరుకు వ్రాయండి

NAVARTNA KALPA PHARMACY
Jullundur City (India)
Grams "Navratna"

కలాపి
టాల్కం పౌడర్

రెండు కొత్త ప్యాకింగులలో దొరుకును
టిన్ రు. 2-4-0
కార్డుబోర్డు బాక్సు రు. 1-8-0
కలాపి ఇండస్ట్రీస్, బాంబే-2.

నీ కవసరమైనదేది?

"నశించిన దానిని వెదకి రక్షించుటకు మనుష్యకుమారుడు వచ్చెనని అతనితో చెప్పెను" (లూకా 19:10

నీవు పాపివి

పాపమువలన నశించితివి

నీ పాప విమోచనార్థము, యేసు అను రక్షకుడు ఈ లోకమునకు వచ్చెను.

నీవు నశించితివని యెరుగుదువా?

అట్లయితే

రక్షకుడైన యేసు నీ కవసరము

తెలిసికొనగోరిన వివరములకు The Roses, Kotagiri Nilgiris, Madura Dist అని వ్రాయుము.

క్రీస్తు చరిత్ర చదువగోరిన. జీవిత ప్రకాశ బడి, రామాయపట్టణము నెల్లూరు జిల్లా అని వ్రాయుము.

6-W 30-3-56

భారతమందు
అత్యధిక అమ్మకము
జ్యోతి బోర్ హోల్ టర్బైన్ పంపులు

ఇప్పుడు సుమారు 2000 జ్యోతి బోర్ హోల్ టర్బైన్ పంపులు భారతదేశ పెరుగుచున్న నీటి ఆవశ్యకతను పూర్తి చేయుటకు తోడ్పడుచున్నవి. గత 10 సంవత్సరములలో మన దేశమందలి ఉపయోగింపబడిన బోర్ హోల్ పంపులలో ప్రతి రెండు పంపులలో ఒకటి 'జ్యోతి' వారి తయారీక.

QUALITY IS OUR CREED.

★ ఆయిల్ ల్యూబ్రికేటెడ్ పంపు

4" నుండి 20" ల వ్యాసముగల బోరులకు యోగ్యమైనవి. నీళ్ళు లాగు శక్తి: గంటకు 3,00,000 గేలన్ల వరకు, నీళ్లను పైకి ఎత్తు శక్తి 300 అడుగుల వరకు.

వివేక వివరములకు
జ్యోతి లిమిటెడ్ బరోడా-3
ఫోన్ - 2367 ప్రాయర్ వ్రాయుము గ్రామ్ - JYOTIPUMPS

ఆంధ్ర సచివాలయ ఉద్యోగుల సంఘ కార్యవర్గం.

కటకం రయిల్వే డిస్ట్రిక్టు యింజనీరు కార్యాలయం అక్కౌంటెంటు శ్రీ యడవల్లి రామమూర్తి వారి తండ్రిగారి స్మారకార్థం నిర్వహించిన శ్రీ వెంకటేశ్వర బ్యాడ్మింటన్ టూర్నమెంట్సులో పాల్గొనినవారు. కుర్చీలమీద ఎడమనుంచి శ్రీ ఎ సుబ్రహ్మణ్యం, శ్రీ ఎ. సలాం, శ్రీ కె. భీమారావు, శ్రీ యడవల్లి రామమూర్తి (నిర్వాహకులు), శ్రీ గోపీనాథ్ పట్నాయక్, శ్రీ జి. వి రాములు—విన్నర్సు వారు- మొదటి వరుస—శ్రీ యస్ పి. స్వామి, శ్రీ శేఖరా, శ్రీ ఎ. ఆచారి, శ్రీ కె రంగనాయకులు, శ్రీ బి రథో, శ్రీ అయ్యంగార్, శ్రీ నారాయణరావు. పై వరుస శ్రీ ఎ సోమరాజులు, శ్రీ నారాయణరావు పట్నాయక్, శ్రీ వి వి రావు.

# హిందూపురం ప్రాంతం అభివృద్ధి

## రైతుల తోడ్పాటుతో కృషి

హిందూపురం, ఏప్రిల్ 6: హిందూపురం సమాజాభివృద్ధి కార్యక్రమశాఖ ఆధ్వర్యాన 1955-56లో వ్యవసాయాభివృద్ధి పనులకు రు. 12615-8 6 ఖర్చుచేశారు. గ్రామాలకు విద్యుచ్ఛక్తి సప్లయి చేయడం వల్ల వ్యవసాయపు పనులు సులభమైనవి. 1291 ఎకరాల్లో జపాన్ పద్ధతిలో వరిసాగు జరిగింది. ఈ సేద్యం పద్ధతిని వివరించేందుకు 1059 ప్రదర్శనలు జరిగినవి. 14097 మణుగుల ఎరువుల వాడకం జరిగింది. పంటల పోటీలలో 7 గ్రామాలు పాల్గొనినవి. ఆధునిక పద్ధతులలో సేద్యం జరిగినందున 2118 టన్నుల ఆహారధాన్యాలు అదనంగా పండినవి. రైతులకు మంచివిత్తనాలు సప్లయి చేసేందుకు ఒక ప్రదర్శన క్షేత్రాన్ని ఏర్పాటు చేశారు.

పశుసంపదభివృద్ధికి హిందూపురంలో కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రమొకటి ఏర్పాటు చేశారు. జె రాయ్, సింధి, హాల్బికార్ జాతి అబోతులు, ముర్రాజాతిదున్న ఆ కేంద్రంలో ఉన్నవి.

1914 మందిని సహకార సంఘాలలో సభ్యులుగా చేర్చారు. సహకార సంఘాల సభ్యులకు రు 1,22,218 వ్యవసాయ ఋణాలుగా ఇచ్చారు. బహుళార్థ సాధక సహకార సంఘాలు 35, పాలసప్లయి సహకార సంఘాలు 7, చేనేత పారిశ్రామికుల సహకార సంఘం 1, సహకార వస్తువిక్రయ కేంద్రాలు 3, నీరా ఉత్పత్తి సహకార సంఘం ఒకటి, వ్యవసాయ పారిశ్రామిక సహకార సంఘం ఒకటి ఈ కేంద్రం ఆధ్వర్యాన పనిచేస్తున్నవి.

లేపాక్షిలో ప్రాథమిక ఆరోగ్య కేంద్ర మొకటి ఏర్పాటు చేశారు. గ్రామాలలో 164 పాయిఖానా దొడ్లు నిర్మించారు. 128 ఫర్లాంగుల కచ్చా రోడ్లు వేయించారు.

30 ప్రాథమిక పాఠశాలలకు భవనాలు కట్టించారు. 60 పాఠశాలల్లో గ్రంథాలయాల నేర్పాటుచేశారు. చాలా పాఠశాలల విద్యార్థులకు సంగీత వాయిద్యాలు, ఆటవస్తువులు మొదలైనవాటిని సప్లయిచేశారు. సేవామందిరంలో చర్చ సమావేశం జరిగింది. లేపాక్షిలో గ్రామ నాయకుల శిక్షణ శిబిరాన్ని ఏర్పాటు చేశారు. గ్రామాలలోని ప్రజలు కూడా సముచితోత్సాహంతో అభివృద్ధి పనులలో పాల్గొన్నారు.

ఈ సంవత్సరం ఈ కేంద్రానికి మొత్తం రు 2,84,632 కేటాయించగా రు. 2,79,500-4-8 ఖర్చయింది.

### తాలూకాలో పట్టు పరిశ్రమ

హిందూపురం, ఏప్రిల్ 6: పట్టు పరిశ్రమ కేంద్ర మండలి ఉపాధ్యక్షుడు శ్రీ నమ్‌సుద్దీన్‌ఖాన్, సహాయ కార్యదర్శి శ్రీ వి గోవిందన్, పరిశ్రమలశాఖ డిప్యూటీ డైరక్టరు శ్రీ పి. పోలిరెడ్డి హిందూపురం తాలూకాలోని చల్లపల్లి కోటిపల్లి గ్రామాలలోని మల్బరీ తోటలను, పట్టు పురుగుల పెంపకం కేంద్రాలను ఈనెల 4 వ తేదీన చూచారు. హిందూపురంలోని ప్రభుత్వ పట్టు వస్త్రాల ఫ్యాక్టరీని కూడా వారు చూచారు. పట్టు పరిశ్రమ నిపుణుడు శ్రీ పి. ఎ. అచ్చయ్య, సమాజాభివృద్ధి కార్యక్రమ శాఖాధికారి శ్రీ కె. శివప్పకూడా పర్యటనలో పాల్గొన్నారు. సక్రమంగా పట్టు పురుగులను సప్లయి చేయించి తయారుచేసే సరుకుకు అమ్మకం సౌకర్యాలు ఏర్పాటు చేయించమని తాలూకా పట్టుపారిశ్రామికులు అభ్యర్థించారు. ఈ ప్రాంతంలో పట్టు పరిశ్రమ అభివృద్ధి చెందుతున్నందుకు ఈ ప్రముఖులు సంతృప్తి ప్రకటించారు. రాష్ట్రంలో పట్టుపరిశ్రమ విషయమై ఆంధ్ర ప్రభుత్వానికి వీరొక నివేదిక సమర్పించనున్నారు.

### బెంగాల్ బీహార్ల విలీనం

#### న్యాయవాదుల ప్రతికూలము

కలకత్తా, ఏప్రిలు 9: పశ్చిమ బెంగాలు ప్రజాస్వామ్య న్యాయవాది సంఘ ఆధ్వర్యాన జరిగిన, రాష్ట్ర న్యాయవాదుల మహాసభలో, బెంగాలు బీహారు రాష్ట్రాల విలీనాన్ని ప్రతిఘటిస్తా తీర్మానించేశారు.

భాష, విద్య, సంస్కృతి, పరిపాలన ఇత్యాది వాటిలో, బెంగాల్ బీహారు రాష్ట్రాల విలీనంవల్ల, రెండు రాష్ట్రాల వారికి హానివాటిల్లుతుందని హెచ్చరిక చేశారు.

కలకత్తా హైకోర్టు జడ్జి శ్రీ దేశం ప్రసాద ముఖర్జీ మహాసభకు అధ్యక్షత వహించారు.

[illegible] ప్రాంతాలలో ఉండే వారి సమస్యలు పరిష్కారం కోసం వని తీర్మానంలో పేర్కొన్నారు.

### 21 మంది పోలీసులపై హత్యా నేరం

అహ్మదాబాద్, ఏప్రిల్ 9: రామ్‌సింగు అనే ఒక సిక్కు కాపలాదారును అక్రమంగా నిర్బంధించి, చిత్రహింసలకు గురిచేసి, చంపి, శవాన్ని చాటుగా మాటు పెట్టారనే నేరాలపై ఒక పోలీసు ఇన్‌స్పెక్టరు, ముగ్గురు సబిన్‌స్పెక్టర్లు, 4 గురు హెడ్‌కానిస్టేబిల్సు, 13 గురు పోలీసులను సెషన్సు విచారణకు పంపారు. రామ్‌సింగును చిత్రహింసకు గురిచేసి, చికిత్స చేయించే శ్రద్ధయినా తీసుకోలేదనికూడా ఈ పోలీసులపై ఆరోపించారు.

రామ్‌సింగు మున్సిపల్ నాటకశాలలో కాపలాదారుగా పనిచేస్తూ ఉండేవాడు. అతనిని మరొకనిని 1955 మే 12 వ తేదీని ఒక హత్యకేసు సందర్భంలో పై పోలీసులు అరెస్టుచేశారు. నిర్బంధంలో అతన్ని చిత్రహింస చెయ్యగా చనిపోగే, శవాన్ని ఒక మున్సిపల్ కంట్రాక్టరు, ఒక హోటల్ వాని సహాయంతో నగరం పొలిమేరల్లో పొలాల్లో పాతిపెట్టారని నేరం మోపారు.

మొదట 23 మంది పోలీసులు, అధికారులపై నేరం మోపారు. వారిలో ఒక సబిన్స్పెక్టరు అప్రూవరుగా మారినందువల్ల అతని నేరం క్షమించారు. ఒక పోలీసును నిరపరాధి అని విడిచిపెట్టేశారు.

### లక్ష్మణేశ్వరం చెరువు

#### గ్రామస్థుల శ్రమదానంతో సిద్ధం

నరసాపురం, [illegible] డిప్యూటీ పంచాయతీ అధికారి శ్రీ పి. రామమోహనరావు ప్రోత్సాహంతో లక్ష్మణేశ్వర గ్రామంలో గ్రామస్థులు స్వయంగా మంచినీటి చెరువును త్రవ్వుకొన్నారు. శ్రమదానంచేసిన గ్రామస్థుల గౌరవార్థం పంచాయతి అధ్యక్షుడు శ్రీ చాగంటి శేషయ్య అల్పాహారవిందు చేశారు. పంచాయతీ అధికారి, బోర్డు అధ్యక్షులు కూడా శ్రమదానంలో పాల్గొన్నారు.

### వెంకటగిరి పంచాయతీ

#### 15 మంది సభ్యుల ఎన్నిక

వెంకటగిరి, ఏప్రిల్ 9: ఈ గ్రామ పంచాయతీలోని 15 స్థానములకు, ఎన్నికలు పూర్తి అయినవి పోటీలేకుండా 8 మంది పోటీలో 7 గురు గెలుపొందారు.

వార్డుల వారీగా గెలుపొందిన అభ్యర్థుల పేర్లు యివి:

1 వ వార్డు: గోరాబత్తుల నాగయ్య, కాయి శ్రీనివాసులు నాయుడు, 2 వ వార్డు: గోరాబత్తుని చినవీరయ్య, కుత్తి బొజ్జయ్య, 3 వ వార్డు: హరిదాసు శ్రీనివాసరావు, అట్ల వెంకటసుబ్బయ్య, 4 వ వార్డు: న్ర్రా మీనయ్య, 5 వ వార్డు: జె రాజగోపాలరావు, 6 వ వార్డు: తిరుమల శెట్టి వెంకటసుబ్బయ్య, 7 వ వార్డు: పసుపులేటి వెంకటసుబ్బయ్య, పురుషోత్తరి చిన రామకృష్ణయ్య, చింతపట్ల జయరామయ్య, 8 వ వార్డు మలవరు వెంకటరత్నం, అనుపల్లి శేషయ్య, 9 వ వార్డు: షేక్ అబ్బు సాహెబ్.

అధ్యక్ష, ఉపాధ్యక్షుల ఎన్నిక చాలా సందడిగా ఉన్నది.

### కృష్ణానది నీటిమట్టం

విజయవాడ, ఏప్రిల్ 9: నిన్న దయం కృష్ణానది నీటిమట్టం, ఆనకట్టకు 3 అంగుళాలు పైగా ఉన్నది.

నేడే చూడండి! విశాలాంధ్రలో అన్ని ముఖ్య కేంద్రాలలో

భరణీ వారి...
చింతామణి

| | | | |
|---|---|---|---|
| విజయవాడ ... | లక్ష్మి | కర్నూలు ... | విక్టరీ |
| గుంటూరు ... | సత్యనారాయణ | బళ్లారి ... | ప్రభాత్ |
| తెనాలి ... | వెంకటేశ్వర | చిత్తూరు ... | లక్ష్మి |
| నెల్లూరు ... | శ్యామల | పార్వతీపురం ... | వేణుగోపాల |
| రాజమండ్రి ... | మినర్వా | శ్రీకాకుళం ... | అంజనేయ |
| విజయనగరం ... | ప్రభాత్ | భీమవరం ... | వెల్‌కం |
| విశాఖపట్నం ... | క్రౌన్ | గుడివాడ ... | గౌరీశంకర్ |
| కాకినాడ ... | | నిడదవోలు ... | వీరభద్ర |

12-4-56 నుండి మ్యాటినీలతో

| | | | |
|---|---|---|---|
| ఏలూరు ... | గోపాలకృష్ణ | సికింద్రాబాద్ ... | అజంతా టాకీస్ |
| చీరాల ... | మోహన్ | హైద్రాబాద్ ... | దీపక్ మహల్ |
| వరంగల్ ... | రాజరాజేశ్వరి | | |

డిస్ట్రిబ్యూటర్లు: నవయుగ ఫిలింసు, బెజవాడ, గుంటకల్లు.
ఆంధ్ర సీడెడు: నవయుగ ఫిలిమ్సు, బెజవాడ, గుంటకల్లు. నైజాం: ది ఆలిండియా ఫిలిం కార్పొరేషన్ లిమిటెడ్, సికింద్రాబాదు.

డైరక్షన్: రామకృష్ణ

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd. by S. Radha Krishna, at The Andhra Patrika Press, 6 & 7 Thambu Chetty St, Madras-1. Editor S. Sambhu Prasad.